62



# గోర్కీ కథలు

అనువాదం:

మహీధర జగన్మోహన్‌రావు

విశ్వసాహిత్యమాల - రాజమండ్రి

విశ్వసాహిత్యమాల 44.

# గోర్కీ కథలు

## ఒకటో భాగం

అనువాదం :

జగన్ మోహన్



విశ్వసాహిత్యమాల-రాజమండ్రి

# GORKY KATHALU

*Translated by*

*M. Jagan Mohan Rao*

AVANTI PRESS – RAJAHMUNDRY.

NOVEMBER – 1947

Price 2-00

# ముందుమాట

గోర్కీ పేరు విననివారు నేటి యువకుల్లో లేరు. శ్రామిక వర్గోద్యమం బలపడిన యీ దేశంలో గోర్కీ మహాశయుని రచనలు చవి చూసిన ఆంధ్రపాఠకులు యీ మహాకవి సందేశాన్నీ, పిలుపునూ అందుకొనే వున్నారు.

గోర్కీ రచనలు అనేక దేశభాషల్లో కనువదింపబడినాయి. తెలుగులో "అమ్మ" అనే నవల, కొన్ని కథలు మాత్రమే వెలువడినాయి. ఈ సంపుటిలోని కథలు యింతవరకు తెలుగుపాఠకుల కపరిచితములు. క్రమంగా గోర్కీ లేఖిని నుంచి వెలువడ్డ అమూల్య రచనలను ఆంధ్ర మహాజనుల ముందు ఉంచ ప్రయత్నిస్తాము.

గోర్కీ గొప్ప కళావేత్త. యుగయుగాల నుంచీ పీడితులై, తాడితులై, దారిద్ర్య అజ్ఞాన పీడనలకు గురియై ధూళిలో పొర్లాడుతున్న "మానవాధములు" "నరపశువులు" గోర్కీ నిశిత కళావైదగ్ధ్యం క్రింద వెలుతురులోనికి వచ్చేరు. వాళ్ళూ మానవులే యనీ; మనమే మానవుల మనుకొనేవాళ్ళు చాలమంది అందు కనర్హు లనీ ఎలుగెత్తి చాటినవాడు, గోర్కీ. మానవుని సుస్వభావం జయించితీరుతుం దనీ, పురోగమనమే ప్రకృతిసిద్ధమనీ, కృతకములైన జాతి, మత, వర్గ భేదాల్ని దాటి మానవులు మరో నూతనలోకంలోకి అడుగుపెడతా రనీ ఆయన విశ్వాసం. దాని సాధనకే జీవితాన్నర్పించిన జ్ఞాని.

గోర్కీ సాహిత్యసేవ చేసిన నలభైసంవత్సరాల్లోనూ ఎన్నో కథలు, నాటకాలు, నవలలు, వ్యాసాలు, లేఖలు రాసేడు.

గోర్కీ వంటి ఉత్తమకళాకారుని రచనలను ఆంధ్రపాఠకుల కందించాలనే ప్రయత్నంయొక్క మొదటి ఫలితం యిది. త్వరలోనే ఆయన యితర రచనలనీ పాఠకుల కందింపగలమని మా యాశ.

రాజమండ్రి, 15-11-1947

మహీధర జగన్మోహన్ రావు,
సంపాదకుడు.

# విషయసూచిక



Ramamohan

# గోర్కీ కథలు

## యూదు బాలుడు.

ఇంత సామాన్యమైన విషయాన్ని చెప్పడం ఎట్లాగో నాకు తెలియడం లేదు. ఐనాసరే, యీ చిన్నకథని మీకు చెప్పడానికి సాహసించక తప్పదు.

నా చిన్నతనపురోజుల్లో మాట. మావీధుల్లో కుర్రాళ్లం అందరం జట్టుగా వుండేవాళ్ళం. ఆదివారం వచ్చినా, వేసవి సెలవులు వచ్చినా మేమందరం 'హాలో' మని బైలుదేరి మా వూరికి సమీపంలోనేవున్న అడవికిపోయి, పక్షుల్లా స్వేచ్ఛగా, సంతోషంగా తిరిగేవాళ్ళం. వాళ్ళందర్లోకీ నేనే పెద్దవాణ్ణి అన్నివిధాలా. వయస్సులోనూ, ఒడ్డుపొడుగుల్లోనూ, బలంలోనూ అధికుణ్ణి నేనే అవటంవల్ల మాగుంపుకి నేనే నాయకుణ్ణి కూడాను.

దుమ్ము కొట్లాడుతూండే మావీధులు వదలిపెట్టి, అడవికి పోవడానికి మాకెంతో సంతోషం. అందుచేతనే సెలవుదినం వస్తూందీ అంటే మాకందరికీ యెంతో ఆతురతగా వుండేది. పిల్లలందరూ వాళ్ళ తల్లులచేత రొట్టెలు చేయించుకుని పట్టుకొచ్చేవారు. నేనుమాత్రం బజారులో మిఠాయికొని, ఓ పెద్ద సీసా నిండుగా షర్బతు పోసుకొని, బైలుదేరేవాణ్ణి. పచ్చటి ఆకులతోనూ, రంగురంగుల పువ్వులతోనూ, పళ్లా కాయల

తోనూ కలకల్లాడుతూండే అడవి మమ్మల్ని చేయెత్తి పిలుస్తా న్నట్లుండేది. గొర్రెలమందను తోలుకుపోయే గొల్లలాగే నేనూ యీ పిల్లలను తీసుకుని పోతూండేవాణ్ణి.

మేమెప్పుడూ వుదయాన్నే బైలుదేరే వాళ్ళం. ప్రాతః కాల ప్రార్థనకు చర్చిలో గంటలు మోగేవేళా, మేం అడవికి సాగేవేళా ఒకటే. పిల్లలకాళ్లు వీధుల్లోని దుమ్ముని రేపుతూంటే, ఆ ధూళి మేఘాల్లా మా వెంబడే వచ్చేది.

అడవికి చేరుకుని పొద్దు నడినెత్తి కొచ్చేదాకా ఆట లాడుకొనేవాళ్లం. అప్పటి కందరూ బాగా అలసిపోయేవాళ్ళు. దగ్గరలోవున్న ఓ సెలయేటి దరికి చేరుకుని చల్లనినీళ్లలో కాలుచేతులు కడుక్కుంటే యెంతో సేదదేరినట్లుండేది. తెచ్చిన మూటలు విప్పి, రొట్టెలు, బిస్కట్లు, మిఠాయిలు తిని, తలో కాస్త పర్బతు తాగేవాళ్ళం. మరీ చిన్నపిల్ల లేచెట్టునీడనో పడుకుని చూస్తూండగానే నిద్రపోవడం, పెద్దపిల్లలు సరదాగా బాతాఖానీ కొడుతూండడం,— యిదీ తరువాతపని. మేలుకుని వున్నవాళ్ళు నన్నేదేనా కథ చెప్పమని పేపుకుతినేవాళ్ళు; వాళ్ళని చుట్టూ కూర్చోపెట్టుకుని సరదాగా మాట్లాడుతూ, కథలు చెప్పేవాణ్ణి. నాకెన్నో కథలు వచ్చునులెండి. తెచ్చిపెట్టు కున్న ఆరిందాతనం, దానితోవచ్చే గాంభీర్యం,—యివినాకెంతో ఆనందాన్నిచ్చేవి. కాని ఒక్కొక్కప్పుడు నాలో యింకోభావం కూడా కలిగేది. కథలువింటూ నిశ్శబ్దంగా కూర్చున్న ఆపిల్లలే మహామేధావు లనీ, నేనే అజ్ఞానిననీ అనిపించేది, ఎందుకో!

ఏ చెట్టునీడనో వెల్లకిలా వాలి, తివాచిలావున్న మెత్తని పచ్చికలో విశ్రమించిన నాచుట్టూ తమ అమాయక నేత్రాలతో బహుశ్రద్ధగా చూస్తూ కూర్చునేవాళ్ళు, పిల్లలు. పైన వినీలాకాశం, సమీపంలో గలగలా ప్రవహించే సెలయేరు, చుట్టూ పచ్చని చాందినీ కట్టినట్లున్న అడవి; అంతా నిశ్శబ్దం. గాలివీచినపుడుమాత్రం చెట్లఆకులూ, పొదలూ గలగల్లాడుతూ కదిలేవి. చెట్లనీడలు అటునిటు జరుగుతూ కదులుతూంటే ఎండ నీడలు మామీద ఆటలాడేవి. ఆ దృశ్యమంతా నా హృదయాన్ని ఆనందంతో నింపేది.

వినీలాకాశంలో తెల్లని మేఘశకలాలు కదిలిపోతూండేవి. వెచ్చగావుండే భూలోకంనుంచి చూస్తే ఆకాశపు నీలిమలో ఎంతో చల్లదనం వుందనిపిస్తుంది. ఆకాశంలో కదులుతూ, కరిగిపోతూండే తెల్లనిమేఘాలు చూపరహృదయాల్లో ఆశ్చర్యానందాల్ని వెదజల్లిపోతూంటాయి.

ఆ నిరాడంబర మనోహర ప్రకృతిసీమల్లో సుఖాసీనులై మానవజీవితపు సుఖదుఃఖాల్ని కథలరూపంలో వినేందుకు పిల్లలంతా నాచుట్టూ చేరేవారు.

గతించిపోయిన ఆ దినాలే నాజీవితంలో సుఖ సంతోష నిలయాలు. ప్రపంచంలోని అంతులేనిదుఃఖంతో, బానిసత్వంతో మోడుబారిన నా మనస్సులో బాల్యంలోని అమాయిక సంతోషానుభవస్మృతే మరల మరల జీవాన్ని పోస్తూంటుంది. నాజీవితపుటాశల్ని అమరంగా, నవ్యంగావుంచేది బాల్యస్మృతే.

మామూలుగానే ఒక సెలవురోజున పిల్లలందర్నీ వెంట బెట్టుకుని బైలుదేరి అడవికి పోతున్నాను. ఊరిబైట మాకొక అపరిచిత బాలకు డెదురుపడ్డాడు. వాడి కాళ్ళకి జోడులేదు. చిరిగిపోయిన చొక్కాలోంచి కృశించిన శరీరం తొంగిచూస్తూంది. గిరజాల జుట్టు మొఖంమీద పడుతూంటే మాటి మాటికీ వెనక్కి ఒత్తుకుంటూ నడుస్తూన్నాడా బాలుడు. అతని శ్వేతముఖంలో అనంతమైన బాధ నిగూఢంగా కనిపిస్తూనేవుంది. చూడ్డంతోటే అతడొక యూదుబాలుడని అందరం గ్రహించేం.

పాలిపోయి, కాంతిహీనంగావున్న ఆబాలునిముఖంలోని రెండు నల్లటికళ్ళూ యెర్రబడివున్నాయి. బహుశా అంతక్రితమే యేడ్చి యేడ్చి వుంటాడు. ఆ బాలుడు మా అందరి మధ్యా కాళ్ళు నిలద్రొక్కుకు నిలబడ్డాడు. కమిలి నల్లబడివున్న అతని రెండు పెదిమలూ భయంవల్ల విడివడ్డాయి. మరుక్షణంలో తేరుకుని ఒక్కగంతులో మామధ్యనుంచి బైటకురికేడు.

"పట్టుకోండిరా! యూదు వెధవని పట్టుకోండి!" అని అరిచేరు, కుర్రాళ్ళందరూ.

యూదుబాలుడు పారిపోతాడనే అనుకున్నాను, కాని వాడు పెదవులు బిగించి, శరీరాన్ని కూడదీసుకుని, నడ్డివెనక చేతులుకలిపి అక్కడున్న దడికి జేరబడి నిల్చున్నాడు. ఓక్షణం అట్లాగే నిల్చుని హఠాత్తుగా అన్నాడు:

"మీకో తమాషా చూపించనా?"

స్పష్టమైన కంఠంతో తాపీగానే మాట్లాడే డాతడు. తనను కాపాడుకోడానికి యిదో యెత్తు అనుకున్నాను, మొదట్లో. పిల్లలందరూ వాడిమాటలకు అంగీకారంగా తలలూపి దూరంగా నిలబడ్డారు. కొంచెం పెద్దకుర్రాళ్ళుమాత్రం వాడివైపు క్రూరంగాచూస్తూ, ధిక్కారంగా అక్కడే నిలుచున్నారు.

మా పిల్లవాళ్ళలోకూడా కక్షలకేం తక్కువలేదు. ఓ వీధి పిల్లలకీ రెండోవీధివాళ్ళకీ యెప్పుడూ పేచీలే. అన్నివిషయాల్లోనూ ఒకరు తమకు తీసికట్టే అని మరొకరి అభిప్రాయం. కాస్త చిన్నపిల్లలుమాత్రం యీ భేదాల నేమీ లెక్కచేసే వాళ్ళుకారు. ఈ సందర్భంలోకూడా మాలోని చిన్నపిల్లవాళ్లే చొరవతీసుకున్నారు :

"అబ్బాయీ ! రా ! తమాషా చూపించు, మరి." అన్నారు, వాళ్ళంతా యేకకంఠంతో.

సన్నటి అందమైన ఆ యూదు కుర్రాడు ముందుకి వచ్చేడు. వెనక్కి వాలి, చేతులు నేలకానించి, కాళ్ళు పైకి లేపి, చేతులమీదే నిలబడ్డాడు. ఆతర్వాత రకరకాల మొగ్గలు వేసి చూపుతూంటే చిరుగుల గుడ్డల్లోంచి పన్నెమాసిన వాని శరీరం కనిపించేది. వాడి యెముకలగూళ్లుకూడా పైకి వచ్చే వున్నాయి. ఇంకోమారు వంగితే ఆ సన్నటి యెముకలు విరిగిపోతాయేమో! అనిపించేది. చెమటతో తడిసిన చొక్కా వీపుకి అంటుకు పోయింది. ఒక్కొక్క ఫీటు అయిపోయినప్పుడు చుట్టూవున్న మాఅందరివైపూ చూచి, నిర్జీవమైన నవ్వు తెచ్చి

పెట్టుకునేవాడు. ఆతని కళ్ళు నవ్వినపుడు పెద్దవై బాధతో తెరుచుకున్నట్లుండేవి. ఆ నేత్రాల్లో యెంతో ఓరిమీ, గాంభీర్యం తొణికిసలాడేవి. వాడి మొగ్గలూ, పల్టీలూ చూసి పిల్లలంతా ఉల్లాసంగా కేకలువేస్తూ, హుషార్ చేస్తున్నారు. కొందరు వాని ననుకరిస్తూ ఆ దుమ్ములో పల్టీలు కొడుతూన్నారు. తమ ప్రయత్నాల్లో నెగ్గిన వాళ్ళ అట్టహాసాలతోటీ, చేతగాక క్రిందపడి యే చెయ్యో మడతపడిన వాళ్ళ యేడ్పులతోటీ, అంతా గందరగోళంగా వుంది.

ఇంతలో ఆకుర్రవాడు ఫీట్లు పూర్తిచేసి లేచి నిల్చున్నాడు. మావాళ్ల ప్రయత్నాలుకూడా ఠకీమని నిలిచిపోయేయి! అభిజ్ఞుడూ, అనుభవజ్ఞుడూ ఐన కళావేత్త ప్రేక్షకులవైపూ, పారిరంభకులవైపూ చూసినట్లుగా ఆ యూదుబాలుడు మావైపు చూసేడు. కొంచెం ఆగి, వాడు,—

"నాకేమైనా యివ్వండి!" అని అడిగేడు.

అంతా నిశ్శబ్దంగా వున్నారు. ఓ చివరనుండి యెవరో కేకేసేరు :

"డబ్బు కావాలా ?"

"అవును"

"బలేరా !"

"డబ్బుకైతే మేమూ చెయ్యగలం !"

అంతా తలోకమాదిరిగానూ మాట్లాడుతూన్నారు. వాడు డబ్బడగడంతోటే కుర్రాళ్ళందరికీ మామూలు కోపం,

అసూయ, అనుమానం వచ్చేసేయి. నవ్వుతూ, వెకిలిగా పరిహాసం చేస్తూ, తిడుతూ ఒక్కొక్కరే అక్కడినుంచి ముందుకి సాగిపోతున్నారు. నిజానికి, వాళ్ళదగ్గర చిల్లిడబ్బుకూడా లేదు. నా జేబులో మాత్రం చిల్లర యేడణాలున్నాయి. అవి తీసి యూదుబాలుని చేతిలో పెట్టేను. వాటిని తీసికొంటూ ఆనందంతో 'అభివందనాలు' అని, యింటికి పోడానికి వెనక తిరిగేడు. వాడి వీపుమీద చొక్కా అంటుకుపోయి, నల్లటి డాగులతో వుంది.

"అబ్బాయ్! ఆగు! నడ్డిమీద ఆ డాగులేమిటి?" అని అప్రయత్నంగానే కేకేసేను.

వాడూ ఆగి, వెనుక తిరిగి నిదానంగా నా కళ్ళలోకి చూస్తూ, చిరునవ్వుతో అన్నాడు :

"నానడ్డిమీదేనా? మొన్న తిరునాళ్ళలో మొగ్గలేస్తూ నేనూ, మానాన్నా పైనుంచి క్రిందికి పడిపోయేం. గాయాలు తగిలేయి. నాదెబ్బలు చాలవరకు మానేయి, కాని మానాన్న యింకా మంచం మీదే వున్నాడు."

నేను దగ్గిరికి వెళ్ళి వాడిచొక్కా పైకెత్తేను. ఎడంభుజం మీదినుంచి తుంటివరకూ చీరుకుపోయి వుంది. గాయం మాను పట్టినా యింక పచ్చిగానేవుంది. మొగ్గలువేస్తూన్నప్పుడు చిట్లి, గాయం రేగి, రక్తం పైకి చిందింది.

"అబ్బే! అట్టే బాధగా లేదు. కొంచెం జిలా, నొప్పీ వుందంతే!" అన్నాడా పిల్లవాడు, చిరునవ్వుతో.

నానోట మాటరాలేదు. మూగగానే నిల్చునిపోయేను. వాడు ధైర్యంగా, వీరునిలా నాయెదుటే నిల్చుని నా కళ్ళలోకి చూస్తూ, ఆరిందాలాగ, గంభీరంగా చెప్ప నారంభించేడు.

"నా పొట్టకోసం యీఫీట్లు చేస్తున్నానని అనుకున్నారు గదూ? అది సరి కాదు. మా నాన్నకోసం చేస్తున్నా. ఇంట్లో తిండిలేదు. చేత దమ్మిడీలేదు. మానాన్న గాయాలతో మంచం పట్టివున్నాడు. అందుచేత నేను సంపాదించక తీరదు. మేము యూదులం గనుక అందరూ మమ్మల్ని చూసి అసహ్యించుకొనేవారే, బాధించేవారే. మీ దయకి నమస్కారం. వెడతానండి. సెలవు."

చకచకా హుషారుగా మాట్లాడుతూ, గిరజాలతో అందంగావున్న తల వంచి నాకు నమస్కారం చేసి, త్వరగా నడిచి వెళ్ళిపోయేడు. ఆ ధీరయూదుబాలుని మీదినుంచి నా చూపులు తిరిగి రానంటున్నాయి. కాని చుట్టూ వున్న యిళ్లన్నీ నిశ్శబ్దంగా వానివైపు గాజుకళ్ళతో నిష్కరుణంగా, నిర్లక్ష్యంగా చూస్తున్నాయి.

ఈ కథైతే చాల సాధారణమైనదే. కాని, తరువాత నాజీవితపు కష్టదినాలన్నిటిలోనూ ఆయూదుబాలుని ధైర్యాన్నీ ఓరిమినీ జ్ఞప్తికి తెచ్చుకుని, హృదయాన్ని ఆశతో నింపుకొనేవాణ్ణి.



# ఆ రా ధి త

ఆ మేడక్రింది గదిలో అంతా చెమ్మగా, చీకటిగా వుండేది. కిటికీకి పైట దట్టమైన యినపచిక్కం బిగించేరు. పిండీ, దుమ్మూ కొట్టుకున్న అద్దాల తలుపులు సూర్యరశ్మిని చొరనిచ్చేవేగావు. కిటికీ కెదురుగా యెప్పుడూ బురదతోటీ, నీటితోటీ నిండిన ఖాళీస్థలం. ఆగదిలో మేము యిరవై ఆరుగురం, సజీవయంత్రాల్లా తెల్లవారింది మొదలు రాత్రి పడేదాకా విరామం లేకండా దినానికి పధ్ధానుగు గంటలు పనిచేసేవాళ్ళం. గోధుమపిండి కలపడం, ముద్దలు చేయడం, మర్దించడం, రొట్టెలు–బిస్కట్లు చేయడం, కాల్చడం, – రోజంతా, ప్రతీ దినం యిదే పని.

వీధిన పోయే ముష్టివాళ్ళకీ నిరుద్యోగ కార్మికులకీ రొట్టెలు–బిస్కట్లు పడేస్తామేమో నని మా యజమాని కిటికీకి దట్టమైన యినపచిక్కం బిగించి, సందులేకండా చేసేడు.

యజమాని మమ్మల్నెప్పుడూ వెధవా! కుంకా! లంజకొడకా! అనే పిలిచేవాడు. మా భోజనంలోనికి మాంసానికి బదులు చౌకపారుగా దొరికే సగం కుళ్ళిన ప్రేగులే వుడకేయించి యిచ్చేవాడు. పొగచూరి, బూజుపట్టిన కప్పు క్రింద, ఆ రాతిగోడలనడుమ పనిచేయుడానికి మాకు ఊపిరి తిరిగేదే కాదు. మా జీవితాలు యెంతో భారంగా, నిస్సారంగా గడుస్తూండేవి.

మాకు రాత్రి మకాంకూడా ఆ రాతిగదే. బడలిక తీరకుండానే, నిద్దురబద్ధకంతో వుదయం ఐదుగంటలకే లేచేవాళ్లం. ఇంకా ఆరూ కొట్టకముందే నిర్జీవంగా, ఉదాసీనంగా బల్లల ముందు కూర్చుని, రాతిరి కలిపివుంచిన పిండిముద్దను మర్దించడం, వొత్తడం ప్రారంభించే వాళ్ళం. పిండిని రొట్టెలూ, బిస్కట్లూ కింద చేయడం, గట్టిపడినప్పుడా పిండిని పిసికి మర్దించడం,-రోజంతా అవిరామంగా యిదే పని. టీ కెటిల్‌లో నీరు మరుగుతూ శబ్దం చేస్తూ వుండేది. బిస్కట్లు కాల్చేవాడి అట్లకాడ పెనంమీద 'కిరకిర' మని రోజంతా అంటూనే వుండేది.

తెల్లవారింది మొదలు రాత్రి అయేదాకా రొట్టెల పొయ్యి మండుతూంటుంది. దాన్ని రావణాసురుడికాష్టం అనే చెప్పొచ్చు. మంటలు నాలుకలు చాచుకొని పైకి లేస్తూంటే, వాటి నీడలు గదిగోడలమీద ఆడుతూ మమ్మల్ని వెక్కిరిస్తూన్నట్లుండేవి! కథల్లో చెప్పుకొనే రాక్షసుని తలలాగ పొయ్యి మంటలు కక్కుతూ, వేడిగాలి వదులుతూ నల్లటి గాలి కన్నాలగుండా విరామంలేని మాపనిని తనిఖీ చేస్తున్నట్లుండేది. గాలికన్నాలు రెండూ రాక్షసుని నేత్రద్వయంలాగ అల్పమానవులమైన మమ్మల్ని విసుగ్గానూ, నిరసనగానూ చూస్తూన్నట్లుండి, మాకు భయం గొల్పేవి.

గదంతా, కిందా మీదా పిండి దుమ్ము; నేలమీదంతా మాకాలి బూట్లతో వచ్చిపడిన బురద; మండే పొయ్యివల్ల

వేడెక్కి ఉక్కిరి బిక్కిరి చేసే గాలి; వళ్ళంతా చెమటతో జిడ్డోడుతూ బల్లకి అటు తొమ్మండుగురం, యిటు తొమ్మండు గురం యెదురెదురుగా కూర్చుని, యంత్రాల్లాగ చేతులు కదుపుతూంటే 'కాలప్రవాహం స్థంభించిందా !' అనిపించేది. మాపనిలో మార్పు లేకపోవడంవల్ల అసలు ఆలోచించాల్సిన పనేలేదు. విసుగు పుట్టించే యీ పనికి అలవాటుపడిన మా అవయవాలు, వాటంతటవే పని చేసుకుపోయీవి.

మాలో ప్రతీ ఒక్కనికీ మిగిలిన వాళ్ళని గురించి క్షుణ్ణంగా తెలుసును. నిత్యమూ గంటలకొద్దీ యెదురెదురుగా కూర్చుని, ఎదటవాళ్ళు చేసే ప్రతీ పనీ చూస్తూ, ఆడే ప్రతీ మాటా వింటూండడంవల్ల ఒక్కొక్కడికి మొహంమీద ఎన్ని ముడతలున్నాయో, వాడు మరుక్షణంలో యేం చేస్తాడో, అన్నీ కొట్టినపిండే. కొద్దిరోజుల్లోనే మాకు మాట్లాడాల్సిన అవసరంకూడా కనిపించడం మానేసింది. రోజూ విషయాలేం దొరుకుతాయి గనక మాబోటి బానిసలకి ! ఎప్పుడేనా పేచీలు వచ్చినప్పుడు తప్ప మిగతాసమయాల్లో మౌనంగానే వుండే వాళ్ళం. కాని, తన స్నేహితులతో, తోటివాళ్లతో అస్త మానం పేచీ లెవరికి వస్తాయి ? మేం ఎప్పుడూ యెదుటివాడిలో తప్పులు యెంచేవాళ్ళమేకాదు. అదీగాక పనితో సగం చచ్చి, నిర్జీవయంత్రాల్లావున్న మాకు యితరుల్లో తప్పులెంచే శక్తీ, అవకాశమూకూడా లేవు. మాట్లాడాల్సిన విషయాలన్నీ అయి పోయి, యింకేం లేకుండా ఐపోయినపుడు నిశ్శబ్దం యెంతో

భయంకరంగా వుంటుంది. అసలు సంభాషణే మొదలుపెట్టని వాళ్లకైతే నిశ్శబ్దత అంత భయంకరంగానూ, బాధాకరంగానూ తోచదు.

ఒక్కొక్కప్పుడు నిశ్శబ్దతంటే భయం పుట్టేది. ఎవడో ఒకడు అలిసిపోయిన గుర్రంలాగ ఒగరుస్తూ, నిట్టూర్చేవాడు. ఇంకొకరు తన మధురస్వరంతో, హృదయబాధను మరపించే గీతాన్ని అందుకొనేవాడు; కాని శీతకాలపు ధూసరాకాశం క్రింద మైదానంలోని చితుకులమంట క్రమంగా సన్నగిలినట్లుగా ఆ సన్నని పాటకూడా గదిలోని సాంద్రవాతావరణంలో క్రమంగా తగ్గుతూ, చివరకి ఆగిపోయిందీ.

ఏదో జ్ఞాపకం వచ్చినట్లుగా మరొకడు ఆపాటనే అందుకునేవాడు. ఆ రెండు గొంతులూ కలవడంతో జాలిగా గీతం సాగిపోయిందీ. ఆ చీకటికోణంలో తళుక్కుని మెరిసిన ట్లనిపించేది, యీ పాట. అందరం గొంతెత్తి పాటలో కలిసేవాళ్ళం. పాట సముద్రపు హోరుతో, తరంగాలుగా లేస్తూ, పడుతూ, ముందుకురుకుతూ సాగిపోయిందీ. ఆ చీకటి గది వెలుతురుతో నిండినట్లూ, గోడలు విశాలంగా జరిగినట్లూ అనిపించేది. ఇరవై ఆరు మగగొంతులు కలిపి పాడుతూంటే గదంతా నిండిపోయి, ఆ మేడనంతా ఊపేసేది. మా బానిసహృదయాల్లో అనిర్వాచనీయమైన మధురబాధ కలిగించి, పూర్వస్మృతుల్ని కలిగించి, పాతగాయాల్ని రేపి, మైమరపించగల శక్తి గలదా పాట!

హఠాత్తుగా మధ్యలో యెవరో ఒకరు తమ పాట నాపి, యితరుల పాటను వింటూ కాస్సేపు వూరుకుని, మళ్ళీ పాట నందుకొనేవారు. ఇంకోడు బాధపడుతూన్నట్టుగా మూలిగి, కళ్ళుమూసుకుని పాటవింటూ, కాంతిమయమైన మరో నూతన లోకాన్నది చూపినట్టూ, తానాలోకంలో సంచరిస్తూన్నట్టూ, భావిస్తూ, అనుభూతి నొందేవాడు.

అంతలో పొయిలోని మంట గప్పుమని పైకి లేచేది; రొట్టెలు కాల్చేవాని షోవెల్ యినపపెనం మీద 'టకటక' మనేది. టీ కెటిల్‌లోని నీరు ఝుంయ్! మని మసలేది. మంటల నీడలు వెక్కిరిస్తూన్నట్లు గోడమీద నాట్యం చేసేవి. మేము మాత్రం యేదీ పట్టించుకోకండా మా మూగఆ వేదనను, సానుభూతి దూరమైన హృదయావేదనను, కష్టమయమైన జీవిత భారాల్ని గూర్చిన పాటలో తన్మయత్వం పొందేవాళ్ళం.

ఇదీ మా జీవితపు గమనం. ఇరవైఆరుగురం మానవులం ఆ రాతిగోడలమధ్య, గోరీలాంటి ఆ నేలకొట్టులో రోజంతా చెమటోడ్చి పనిచేసేవాళ్లం. మాపని చాల కష్టమైనదే. పైనున్న మూడు అంతస్థుల్నీ మా భుజాలమీదే మోస్తూన్నామా అనిపించే దొక్కొక్కప్పుడు.

ఈ నిరంతర కష్టాలనుంచి క్షణమాత్రం సుఖాన్నిచ్చేవి మా పాటలేగాదు. అంధకారంలో సూర్యకిరణంలాగ మరో వస్తువుకూడా మాకు లభించింది. ఆ వస్తువును మనసారా ప్రేమించి, ఆరాధించే వాళ్ళమంటే ఆశ్చర్యమేముంది?

మా ఆరాధ్య వస్తువేదో చెప్పనా?

ఆ మేడ రెండో అంతస్తులో బంగారు జరీపని చేసేవాని కొట్టువుంది. అందులో బుటేదారీ పనిచేసే యువతులెందరో వుంటారు. వాళ్లలో 'టాన్యా' అనే పదహారేళ్ల పడుచు ఒకతె వుండేది. ఆమె ప్రతీదినం వుదయమే పనిలోకి వెళ్లేముందు మమ్మల్ని పలకరించేది.

మా కొట్టుకి అద్దాల తలుపు లుండేవని చెప్పేనుగదూ? ప్రతీఉదయం ఆ తలుపులవద్ద అప్పుడే వికసించిన గులాబీలాంటి తన ముఖాన్ని ఒత్తి, వినీలనేత్రాలతో నవ్వులొలికిస్తూ, మృదువైన కంఠంతో, విస్పష్టంగా కేకేసేది:

"ఏమయ్యా! చిన్నిఖైదీలూ! నాకేం బిస్కట్లులేవూ?"

ఈ పిలుపుకోసమే యెదురు చూస్తూన్నట్లుగా అందరం అటువైపే తిరిగే వాళ్ళం. మధురంగా నవ్వు లొలుకుతూన్న టాన్యా చిన్నిముఖాన్ని చూసేటప్పటికి మా అందరి హృదయాలూ ఆనందంతో నిండిపోయేవి. తలుపుటద్దానికి ఒత్తుకున్న చిన్నముక్కు, సగం తెరచిన యెర్రటి పెదవులమధ్య తెల్లని పలువరసా, అమాయికమైన నీలికళ్లూ మా చూపులకి విందుగా వుండేవి. ఒకరొన్నొకరు తోసుకుంటూ టాన్యాకి తలుపు తెరవడానికి పరుగెత్తేవాళ్లం. ఆమె లోని కడుగుపెట్టి, జీరాడే గౌనుకుచ్చెళ్లు చేతుల్తో పైకెత్తి పట్టుకుని, తల ఓరగా వంచి, చిరునవ్వుతూ నిల్చునేది. చిక్కటి తలకట్టు భుజాలమీదుగా రొమ్ములమీద పడి కదలుతూంటే, మేమందరం వికృతంగా

దుమ్ముకొట్టుకుని వున్న తలలు వంచి ఆ దేవీమూర్తికి స్వాగత మిచ్చేవాళ్లం. ఆమెకోసమే ప్రత్యేకించి దాచుకున్న భావాల్ని బహుజాగ్రతగా యెంచిన మృదువైన మాటలతో వెల్లడించే వాళ్ళం. ఆమెతో మాసంభాషణ యెంతో సౌమ్యంగావుండేది. అసలే మోటు అయిన మా గొంతుకలకు మార్దవం వచ్చేది. ఇంత యెందుకు? ఆమె రాక మా అందరిలోనూ బ్రహ్మాండ మైన మార్పు దెచ్చేది. బిస్కట్లు కాల్చేవాడు పెనం మీది నుంచి దోరగా కాలిన తాజాబిస్కట్లు తీసి, ఆమె వొడిలో వేసేవాడు.

"టాన్యా! త్వరగా వెళ్లిపో! యజమాని చూసేడంటే వూరుకోడు." అని ప్రతీసారీ హెచ్చరించేవాళ్లం.

ఆమె నిర్లక్ష్యంగా నవ్వేసేది.

"అయ్యో! పిచ్చిఖైదీలూ! వెళ్లిపోతాలే."అని, మెల్లిగా అడుగులేస్తూ, చుంచులా నిశ్శబ్దంగా వెళ్లిపోయేది, టాన్యా.

ఆమె వెళ్లిపోయిన చాలాసేపటివరకూ ఆమెని గురించే కులాసాగా మాట్లాడుకొనేవాళ్లం. ఆ మాటల్లోకూడా కొత్త వేమీ లేవు. చర్వితచర్వణంగా రోజూ అవే మాటలు. మాలో కాని, ఆమెలో కాని ఏం మార్పుంది కనక, మా మాటల్లో మార్పు రాడానికి?

పరిసరాల్లోనూ, పరిస్థితుల్లోనూ యేమార్పూలేకుండా జీవించడం యెంతో దుర్భరంగానూ, భయంకరంగానూ వుంటుంది. ఆపరిస్థితుల్లో జీవించేవాని బ్రతుకు బ్రద్దలుకాకుంటే

కాలం గడుస్తూన్న కొద్దీ వానికది మరీ దుర్భరంగానూ, పీడకల గానూ పరిణమించక తప్పదు. కాలం గడపడాని కని మాలో మేము తరుచుగా స్త్రీలను గురించికూడా మాట్లాడుకోడంకద్దు. ఐతే ఆమాటలు మాకే ఒక్కొక్కప్పుడు అసహ్యంగా తోచేవి. మాకు పరిచితులైన స్త్రీలుకూడా అంతగా గౌరవం కలవాళ్ళు కారులేండి. కాని టాన్యానిగురించి మాట్లాడుకునే టప్పుడు ఒక్క చెడ్డమాటేనా రానిచ్చేవాళ్ళం కాదు. మాలో యెవరూ ఆమెని తాకడానికేనా ప్రయత్నించలేదు. ఆమెతో చనువు తీసికొని సరసంకూడా యెవరం ఆడేవాళ్ళం కాదు. ఇంతకీ యివన్నీ జరగడానికి ఆమె మాదగ్గర ఆట్టేసేపుండేదే కాదు. ఆకాశం నుండి జారే ఉల్కలా ప్రత్యక్షమై, మరుక్షణంలో మాయమయేది. అదీ కారణం కాకపోతే, నిర్మలసౌందర్యమే మాలోకూడా మర్యాదను కలిగించిందేమో!

టాన్యా యెంతో అందంగా వుండేది. వెన్ను విరిగే బానిసచాకిరీ మమ్మల్ని నిర్జీవంగానూ, పశువులుగానూ చేసినా, మేమూ మనుష్యులమే. ఇతర మానవు లందరికివలెనే మాకూ ప్రేమించడానికి ఒక వ్యక్తి కావాలి. ఎవరినీ ప్రేమించకండా మేమూ వుండలేము. ఆమెకంటె మంచివాళ్ళనీ, అందమైన వాళ్ళనీ మేమెరుగం. ఆమెగాక యింకెవరూ మమ్మల్ని పలక రించినవాళ్ళు లేరు. ఆ మేడలో యెందరో స్త్రీపురుషులున్నా, మేము టాన్యానే అప్సరాలుగా, ఆత్మీయబంధువుగా చూసు కునీ వాళ్ళం. మేమిచ్చే బిస్కట్లతోనే బతుకుతూన్నదానిగా,

మాలోనే ఒక తెగా భావించి, ఆమెకు బిస్కత్తులిచ్చే బాధ్య తను రోజువారీగా పంచుకున్నాం! మా ఆరాధ్యదైవానికి అర్పించుకునే నిత్యనైవేద్యం కంటే పవిత్రమైన విధిగా తయారై కూర్చుందీ అలవాటు. రోజురోజుకూ ఆమెపై మాఅభిమానం బలపడుతూ రావడంతో రొట్టెలూ, బిస్కత్తులతో బాటు ఆమె అడగకుండానే మా సలహాల్ని కూడా యిచ్చేవాళ్లం. ఇంకా వెచ్చగా వెండే దుస్తులు వేసుకోమనీ, మేడమెట్లు మెల్లిగా యెక్కమనీ, కట్టెలు కొంచెం కొంచెంగానే మొయ్యమనీ,— యిత్యాది. అంతకంటె ఏమున్నాయి లేండి. టాన్యా మా సల హాల్ని చిరునవ్వుతో వినేదేకాని ఆచరించేదికాదు. ఆమె మా అమూల్యమైన సలహాల్ని ఆచరణలో పెట్టలేదే అని మేము విచారించనూ లేదు. ఆమెను మేమెంతగా ప్రేమిస్తూ న్నామో చూపడమే మా ఆశయం.

ఆమె మా సహాయాన్ని తరుచుగా కోరుతూండేది. బరు వుగానున్న స్టోర్సుతలుపు తెరవమనో కట్టెలు కొట్టిపెట్టమనో; ఆమె అడిగిందే పడవుగా ఆపనులన్నీ సంతోషంగా, సగర్వంగా చేసిపెట్టేవాళ్లం. కాని మాలో యెవరైనా తన చిరిగినచొక్కా కాస్త కుట్టిపెట్టమంటే ఆమె అసహ్యంతో నవ్వుతూ,—

"ఇంకేం కోరికల్లేవూ ? బలే వాడివే!" అనేది.

అటువంటి కోరిక వెలిబుచ్చిన ఆ విడ్డూరపు వ్యక్తిని మేమంతా కలిసి వేళాకోళం చేసేవాళ్లం. ఆమెను మా కేమీ

సాయం చేయమని ఎప్పుడూ అడగలేదు. మేము ఆమెను ప్రేమించేం. అంతే. అంతా అందులోనే యిమిడివుంది. పురుషు డెవరినో ఒకరిని ప్రేమించకుండా వుండలేడు. మేము టాన్యాను ప్రేమించక తప్పదు. మాకు ప్రేమాస్పదు లింకెవ్వరూలేరు.

ఎప్పుడేనా మాలో ఒకడు వున్నట్టుండి అనేవాడు:

"మనం టాన్యాను గురించి యింత తాపత్రయ పడు తూన్నా మెందుకు? ఆమెలో ఏముందని?......?"

అందరం వాడిమీద విరుచుకు పడేవాళ్ళం. అంతే, వాడినోరు మూతబడేది. మా ప్రేమకు ఏదో ఒక ఆధారం వుండితీరాలి. మాకు టాన్యాలోనే ఆ ఆధారం దొరికింది. మేము ఆమెని మా ప్రేమకీ, శ్రద్ధాభక్తులకీ నిధానంగా చేసుకున్నాం. మా యిరవైఆరుగురు బానిసలకూ ఆమె పవిత్రవ్యక్తి. ఎవడు వ్యతిరేకంగా మాట్లాడినా మాకు శత్రువే. నిజానికి టాన్యా మంచిది గాకపోవచ్చు. కాని యిరవై ఆరుగురుకీ ప్రేమాస్పద మైన వ్యక్తిని యితరులందరూ కూడా ప్రేమించాల్సిందేనని మా వూహ. లేకపోతే వూరుకోలేం.

*          *          *          *          *

మా యజమానికి బిస్కట్ల దుకాణమేగాక మరో మిఠాయికొట్టుకూడా వుంది. అదీ ఆ మేడ క్రిందిభాగంలోనే మా చీకటికొట్టుకి ప్రక్కనే వుంది. దానికీ మాకూ మధ్య నొక

గోడేఅడ్డు. మిఠాయిలు చేసే పనివాళ్లు నలుగురుండేవారు. వాళ్లెప్పుడూ మాచాయలకే వచ్చేవాళ్ళుకారు. మాపనికంటె తమపని గొప్పదనీ, అంచేత మాకంటె తాము అధికులమనీ వాళ్ళ వుద్దేశ్యం. ఎప్పుడేనా పెరటి ఆవరణలో తారసిల్లినప్పుడు మా వైపు నిర్లక్ష్యంగా చూస్తూ, తిరస్కారపూర్వకంగా నవ్వేవాళ్ళు! వాళ్ల దుకాణంలోకి మమ్మల్నెవర్నీ వెళ్లవద్దని యజమాని హుకుం. ఖరీదైన మిఠాయిలూ అవీ మేము దొంగిలిస్తామని అతని భయం. మిఠాయిపనివాళ్లని చూస్తే మాకు అసూయగా వుండేది. ఔను! అది సహజమే కదూ? వాళ్లపని తేలిక, కూలి యెక్కువ! వాళ్ళకి మంచి తిండి పెడతారు; వాళ్ళు పని చేసేగది కొంచెం విశాలంగానూ, వెలుతురుగానూ కూడా వుంది; వాళ్ళ బట్టలు శుభ్రంగానూ, శరీరాలు ఆరోగ్యం గానూ వుంటాయి! ఇన్ని తేడాలుంటే మా అసూయకు కారణం వుందంటారా? మేం పిండికొట్టుకుని, చీకటిగా, తేమగావున్న గదిలో పనిచేయాలి; వెన్ను విరిగే బండచాకిరీ; అందరం పాలిపోయినట్లుండేవాళ్ళం; మాలో ముగ్గురికి సుఖరోగాలు, ఒకడికి పక్షవాతం, చాలమందికి చర్మరోగాలూ వున్నాయి. సెలవురోజుల్లోనూ, విశ్రాంతి సమయాల్లోనూ వాళ్ళు మంచి దుస్తులూ, బూట్లూ వేసుకుని తిరిగేవాళ్ళు. యిద్దరిదగ్గర చేతి హార్మోనియంలుకూడా వున్నాయి! పట్టణంలోనూ, పార్కుల్లోనూ షికార్లు కొట్టేవాళ్ళు. మురికి గుడ్డలతోటీ, మాసికల

బూట్లతోటీ అసహ్యంగావున్న మమ్మల్ని పోలీసువాళ్ళు పార్కుల్లోకి రానిచ్చే వారే కాదు. ఇన్ని భేదాలున్నాక వాళ్లూ మేమూ సమానఫాయాలో, స్నేహంగా వుండడాని కేమైనా అవకాశం వుందంటారా?

మిఠాయి కొట్టులో పనిచేసే మేస్త్రీ తప్పతాగుతూం టాడు. యజమాని వాణ్ణి తీసేసి, యింకో కొత్తవాణ్ణి పనిలో పెట్టేడు. వాడు పూర్వం పటాలంలో పనిచేసినవాడు. ఆసోల్జరు కొంచెం షోకిల్లా. సిల్కుచొక్కా తొడుక్కుని, జేబుగడియారం, బంగారు గొలుసూ పెట్టుకుంటాడుట. ఆషోకిల్లాగాడిని ఓమాటు చూద్దామని మావాళ్ళు అస్తమానూ వసారాలోకి పరుగెట్టే వాళ్ళు. కాని, వాడంతటవాడే ఓరోజున మాదుకాణంలోకి వచ్చేడు. కాలితో తలుపునెట్టి, లోపలికి వచ్చి గుమ్మంలో నిల్చునే మమ్మల్ని పలకరించేడు:

"వందనాలు! వందనాలు! నేస్తాలూ! మీపని బంగారం గానూ. అస్తమానం పనేనటయ్యా!"

మంచులాంటి చల్లనిగాలి లోపలికి వచ్చి, పొగలా వాడి కాళ్లచుట్టూ అలుముకుంది. మెలేసిన మీసాలక్రిందినుంచి పచ్చటి పళ్ళు కనిపించేలా యికిలించి, మాఅందరికేసీ చాలనగా చూస్తూ నిల్చున్నాడు. వాడికోటు నిజంగా చాలా ఖరీదైనదే! నీలిరంగు పువ్వులూ, మెరటి బొత్తాలూ దానిమీద కుట్టి వున్నాయి. జేబులో గడియారం, గొలుసూ కూడా వున్నాయి!

వాడు మాంచిబలంగా, పొడుగ్గా, చూడ్డానికి బాగా వున్నాడు; కళ్ళు స్నేహాన్ని సూచిస్తున్నాయి. శుభ్రమైన తెల్లటిటోపీ, నెత్తిమీద; పొడుగాటి అంగీ క్రిందినుంచి నల్లటి బూట్లు మెరుస్తూ, అందంగా వున్నాయి.

"తలుపుముయ్యి!" అని మర్యాదగానే కేకేసేడు, మా మేస్త్రీ. అతడు సావధానంగా తలుపువేసి, మాదగ్గిరికి వచ్చి, యజమాని సమాచారం అడుగుతూంటే, మే మందరం యేకగ్రీవంగానే జవాబిచ్చేం. యజమాని వఠ్ఠి కసాయివాడనీ. దొంగ వెధవనీ, బానిసవ్యాపారనీ,—ఇంతెందుకూ, యజమాన్ని గురించి యేంచెప్పాలో అవన్నీ యేకరువుపెట్టేం. మేం అన్న మాటలన్నీ పుస్తకాల్లో రాయడానికి యెవరూ ఒప్పుకోరు. మా మాటలన్నీ వింటూ, సావధానంగా మీసం మెలి తిప్పుతూ, అమాయికంగా చూస్తూనే, హఠాత్తుగా అడిగేడు:

'ఇక్కడ చాలమంది పడుచు లున్నట్టున్నారే?'

మాలో కొందరు యేమీ యెరగనట్లు చప్పరించి వూరుకున్నారు. మరికొందరు కోగంట చూస్తూ, చిరునవ్వు నవ్వేరు. ఒకడు మాత్రం అన్నాడు,—

"మేడమీదకొట్టులో తొమ్మండుగురు పనిచేస్తూన్నారు."

"వాళ్ళు మీకు బాగా వుపయోగ పడుతున్నారా?" అన్నాడు సోల్జరు కన్నుకొడుతూ.

వాడిప్రశ్న కొంచెం యిబ్బందిగా వున్నా, అందరం నవ్వేసేం. 'మేమూ యీవిషయాల్లో గ్రంథసాంగులమే' నని వాడికి తెలియజెప్పాలని మాలో చాలామందికి కోరిక వుంది గాని అది మనస్సుల్లోనే వుండిపోయింది. ఒక్కడూ అందుకు సాహసించలేదు. ఇంతలోనే మాలో ఒకడు మెల్లిగా సమర్థనగా,—

"మేం అటువంటివాళ్ళం గాము!" అన్నాడు.

"ఔను! అవి మీకేం నచ్చుతాయి!" సోల్జరు మమ్మల్ని పరకాయించి చూస్తూన్నాడు.

"మీరు సరైన మగాళ్ళుకారు. మీలో అటువంటిచేవ వున్నట్లు కనిపించదు. ఆడాళ్ళు చొరవగా వున్నవాళ్ళంటే యిష్టపడతారు! మీలాంటివాళ్ళు ఏం ఆనతారు, వాళ్ళకి? బలమైన, ఘట్టిశరీరం కోరతారు, వాళ్ళు. ఆడాళ్ళకంతా టిప్ టాప్‌గా వుంటేగాని నచ్చదు! ఇల్లాంటి కండపుష్టిగల దండ చూసేరంటే వదులుతారా!"

అంటూ కుడిచెయ్యి జాపి, చొక్కా పైకి మడిచి, తెల్లగా, బలంగా కండలుదీరి, రాగివెంట్రుకలతో నిగనిగలాడే చేతిని చూపించేడు.

"తొడలు, గుండెలు, — అన్నీ బలంగా వుండాలి. ఎప్పుడూ సరికొత్త ఫాషన్‌గా నీటుగా తయారవాలి. చూసే టప్పటికే నచ్చేలా వుండాలి. ఆడాళ్ళంతా నేనంటే పైపైన పడతారు. నేను వాళ్ళని పిలవను, చివరకి సైగకూడా చెయ్యను.

ఒక్కొక్కసారి నలుగురైదుగురు కూడా నావెంట బడు తూంటారు.”

వాడక్కడున్న పిండిబస్తామీద కూర్చుని, స్త్రీలు తన్నెలా ప్రేమిస్తారో, తాను వాళ్ళతో యెంత చనువుగా వుంటాడో చెపుతూ చాలసేపున్నాడు. తరువాత సావధానంగా లేచి, తలుపు తీసికొని వెళ్ళిపోయేడు. తలుపు మూసేసి, చాల సేపటివరకూ వాడిమాటల్నీ వాణ్ణీ గురించి ఆలోచిస్తూ మౌనంగా కూర్చుని పోయేము. ఉన్నట్లుండి అందరం ఒక్కసారే మాట్లాడ నారంభించేం. వాడంటే మా అందరికీ నచ్చిందని మా సంభాషణలో వెల్లడయింది. వాడెంత మంచివాడు! నన్ను ముట్టుకోకోయ్! అని వుండకండా, తనంతటనే నచ్చి పలకరించి, బాతాఖానీ వేసిపోయేడు. ఇంతవరకూ మరెవ్వడూ మాతో యింత స్నేహంగా మనసిచ్చి మాట్లాడినవాడే లేడు! మేడమీద పనిచేసే యువతులందరిమీదా వాడు విజయం సాధిస్తాడు. వాళ్ళా! ఆ ఆడాళ్ళ కెంతపొగరు! ఎప్పుడైనా వసారాలోగాని, పెరట్లోగాని తారసిల్లితే మమ్మల్ని ఎంత తిరస్కారంగా చూసేవాళ్ళు! మేం అక్కడ యెదుట లేనట్లే, మేము వట్టి పనికిమాలిన బొమ్మలమైనట్లే చూసేవాళ్ళు! వాళ్లు మమ్మల్ని అంత నిరసనగా చూసినా, మేముమాత్రం వాళ్లని మెచ్చుకోకుండా వుండలేక పోయేవాళ్ళం. వాళ్లు శీతాకాలంలో చక్కటి ఉన్నికోట్లూ, అందమైన వెచ్చటి టోపీలూ ధరించేవాళ్ళు; వేసవిలో పల్చనిగౌనులు తొడిగి

టోపీల్లో పువ్వులగుత్తు లలంకరించుకునేవాళ్ళు. నీటుగా, అందంగా వుండే ఆ యువతుల్ని మెచ్చుకోకండా యెట్లావుండ గలమో చెప్పండి. కాని మాలో మేము సంభాషించుకొనే టప్పుడు మాత్రం వాళ్ళనిగూర్చి మేమనుకొనే మాటలేగనక వాళ్ళు వింటే సిగ్గుతోటీ, అభిమానంతోటీ చావాల్సిందే!

"వాడు మన టాన్యాని పట్టెయ్యడుకదా? కొంపతీసి!" అన్నాడు మా మేస్త్రీ ఎంతో ఆదుర్దాగా.

ఆ మాటలు మమ్మల్ని గాభరా పెట్టేయి. ఎవరూ మాటాడలేదు. వీడిమాటలసందడిలో టాన్యానే మరిచిపోయేం.

మాలో కొందరు టాన్యా అంతటి నీచానికి ఒడబడ దన్నారు; మరికొందరు ఆమె వాణ్ణి తిరస్కరించలేదేమోనని సందేహించేరు; మిగతావాళ్ళు టాన్యాని వాడు వెంటాడుతే దేహశుద్ధి చేయాల్సిందే నన్నారు. చివరకి మా చర్చకి పర్యవసానంగా సోల్జర్నీ, టాన్యానీ కనిపెట్టి వుండాలనీ, టాన్యాను వాడి విషయంలో హెచ్చరించాలనీ నిశ్చయానికి వచ్చేం.

నాలుగు వారాలు గడిచేయి. ఈలోగా సోల్జరు మిఠాయిలు వండడం, జరీపని చేసే యువతులతో షికార్లు కొట్టడం, అప్పుడప్పుడు మా దగ్గిరకి వచ్చి కూర్చుని మీసం మెలేస్తూ, తమకంతో పెదవులు చప్పరిస్తూ, బాతాఖానీ వేయడం చేస్తూండేవాడు. స్త్రీల విషయంలో తన విజయాల్ని గూర్చి మాతో మళ్ళీ వాడెత్తేవాడేగాదు.

టాన్యా ప్రతీదినం ఉదయం మామూలుగా వస్తూనే వుంది. మాతోటి మామూలుగానే ఉల్లాసంగా, చనువుగా సంభాషించి బిస్కట్లు పట్టుకుని వెళ్ళిపోయేది. ఒకటి రెండు సార్లు ఆమెతో సోల్జరు ప్రసంగం తెస్తే, వాణ్ణి పరిహాసంచేస్తూ 'చూపులగొడ్డు' 'తిరుగుడు గుడ్ల గిత్త' అని తిట్టి దిగబార పోసింది. దానితో మా మనస్సులు కుదుటబడ్డాయి. జరీపని యువతులు వాడితో యెల్లా తిరుగుతున్నారో చూసేక, టాన్యా అంటే మాకు గౌరవప్రేమ లధికం అయేయి. ఆమె ప్రవర్తన మా అందరి గౌరవాన్నీకూడా హెచ్చించిన ట్లనిపించింది. మేమూ ఆమె ననుకరించే సోల్జరును లెక్కచేయకండా మాట్లాడే వాళ్లం. టాన్యా మాకు ప్రియతమమైనదై, ఆరాధ్య దైవమయింది. ప్రతిదినం వుదయమే ఆమెకు ఎంతో ప్రీతితో నిత్యానైవేద్యం సమర్పించుకొనే వాళ్లం.

ఇట్లావుండగా ఓ రోజున సోల్జరు మాదగ్గరికి వచ్చేడు. ఆరోజున కాస్త డోసుమీాద వచ్చేడేమో అదేపనిగా నవ్వుతూన్నాడు. నవ్వెందుకని అడిగినమీాదట వాగనారంభించేడు.

"వాళ్లిద్దరూలేరూ, లిడ్కా, గ్రిష్కా,-వాళ్ళు నిన్న నాకోసం రామరావణయుద్ధం చేసేరు; వాళ్ళు కలియబడి రక్కుకోడం చూసితీరాలి! హ్హాఁ! హ్హాఁ! ఒకతె రెండోదాన్ని జుట్టు పట్టుకుని, వరండాలో క్రిందే పడేసి, మీాదెక్కి కూచుంది! హ్హాఁ! హ్హాఁ! హ్హాఁ! వాళ్ళు ఒకరి మొహం ఒకరు బరుక్కుని,

ముక్కలు పీకేసేరు. చూసిన వాళ్ళు నవ్వలేక చచ్చిపోయే రంటే నమ్మండి! ఆడాళ్లు సరిగ్గా కొట్టుకోక అట్లా రక్కు కుంటా రేం ?''

మాట్లాడుతూనే వెళ్లి బెంచీమీద కూర్చున్నాడు. వాడి ఉల్లాసం, సంతోషం, సంతృప్తీ చూస్తే కళ్ళు కుడు తూన్నాయి. కూర్చుని అదే పనిగా నవ్వుతూంటే మాకు నోట మాటలే పెగిలి రాలేదు. వాణ్ణి చూస్తే మాకు యీసారి అసహ్యం కూడా వేసింది.

"ఆడాళ్ళ విషయంలో నా అదృష్టం చూస్తే నాకే ఆశ్చర్యం! ఎందుకూ! ఒక్కసారి కన్నుకొడతానంతే! కుక్కల్లా నా వెంట బడతారు! దాని రస్సా దియ్యా!"

రాగి వెంట్రుకలతో మెరుస్తూన్న తెల్లటి చేతుల్ని పైకెత్తి, మోకాళ్ళమీద చరుచుకున్నాడు. తనకు స్త్రీలు అంత సులభంగా లొంగిపోవడాన్ని గూర్చి ఎంత ఆశ్చర్యపడు తూన్నాడో వాడి కళ్ళల్లోనే ద్యోతక మవుతూంది. బలిసి, యెర్రగావున్న వాడి ముఖంలో ఆత్మసంతృప్తీ, సంతోషం తాండవమాడుతున్నాయి. లాలసతో పెదవుల్ని మాటిమాటికీ నాక్కుంటూన్నాడు.

మా మేస్త్రీ కోపంగా పొడుగాటి షోవెల్‌తో పెనం మీద కొడుతూ, ధిక్కారంగా అన్నాడు :

"తోటకూర మొక్కలు లాగడానికెంత కావాలి? చేవ వున్నవాడివైతే తాటిచెట్టు పీకు, చూస్తాం!''

''ఆఁ! ఏమిటీ? నీ వుద్దేశం?" ఎంతో ఆశ్చర్యంగా అడిగేడు సోల్జరు.

''అబ్బే! ఏం లేదులే.''

''చెప్పు? చెప్పితీరాలి.''

"ఏంలేదు. నోరు జారిందంతే!''

"ఆగు! అక్కడ ఆగు! సంగతేమిటి? తాటిచెట్టేమిటి? చెప్పాలి!''

మేస్త్రీ ఏమీ జవాబివ్వకుండానే షోవెల్‌తో బిస్కట్లు పెనంమీద వేస్తూ, కాలిన వాటిని హడావుడిగా తీసి బైట వేస్తూ, తన పని చూసుకుంటూన్నాడు. కుఱ్ఱాళ్ళు వేడిబిస్కట్లని అక్కడే దారానికి దండగా గ్రుచ్చుతూన్నారు. సోల్జరు ప్రశ్నే మరిచిపోయినట్లు ఎవరిపని వాళ్ళు చూసుకుంటూన్నారు. సోల్జరులో ఆరాటం బైలుదేరింది. లేచి నిల్చుని, చెకచెకా ఆడుతూన్న షోవెల్ తగులుతుందనేనా చూడక మేస్త్రీ దగ్గిరికి వెళ్లేడు.

"చెప్పు. అదెవరో చెప్పు? నన్నా? నన్ను తిరస్కరించే ఆడది వుందా? అహఁ! లేదు! నువ్వు అల్లాంటి అవమానకరమైన మాటంటావా?"

సోల్జరు నిజంగా యెంతో బాధపడుతూన్నట్లుగానే కనిపించేడు. స్త్రీలను పాడుచెయ్యగల శక్తి తప్ప వాడికింకేముంది,

గర్వపడడానికి? ఆ ఆకర్షణ గాక మరేమీ చెప్పుకోదగింది లేదు, వాడిలో. దాన్ని చూసుకొనే తానూ ఒక మనిషినే అని వాడు గర్వంగా తలయెత్తుకుని తిరుగగలుగుతున్నాడు.

ప్రపంచంలో ఒక తరహా మనుష్యులున్నారు. వాళ్ళు తమ శారీరక, హృదయదౌర్బల్యాల్నే, వ్యాధుల్నే గొప్పగా చెప్పుకుంటూ, వాటినే తమ పెన్నిధిగా భావిస్తుంటారు! ఆ దౌర్బల్యాల్నిగూర్చే బడాయి చెప్పుకుంటూ, వాటితోనే బాధపడుతూ, వాటిమీదే పితూరీలు చెప్పుకుంటూ, యితరుల దృష్టిని ఆకర్షించేందుకు యత్నిస్తూంటారు, యీ జనం. వీటి వల్లనే యితరుల సానుభూతిని పొందుతారు కూడాను. ఈజబ్బులు తప్పితే వీళ్లవద్ద చెప్పుకోతగ్గ దింకేమీ వుండదు! ఈజబ్బు తొలగించండి, దాన్ని కుదర్చండి, - బస్, దానితో వాళ్ళపని ఆఖరు; తమ జీవితాధారమే, పునాదే కూలిపోయి నట్లు మధనపడతారు. కొందరు మానవుల జీవితాలెంత నిస్సారంగా వుంటాయంటే వాళ్ళు సహజంగానే తమ దౌర్బల్యాల్ని గూర్చి ఆనందపడుతూ, వాటిమీదే జీవించాల్సి వస్తూంటుంది! అదేగాదు. తరచుగా మానవుడు నిస్సారమైన పీడకలలాంటి జీవితంమీద విసిగిపోయికూడా దుర్మార్గాలకి పూనుకుంటూం టాడు.

సోల్జరుకి యీ మాటలు చాలా అవమానకరంగా తోచేయి. ఆతడు బిగ్గరగా అరిచేడు:

"చెప్పు ! ఎవరో చెప్పు ? ఏం ?"

"చెప్పాలా ?" హఠాత్తుగా మేస్త్రీ వాడివైపు తిరిగి అడిగేడు.

"ఔను !"

"టాన్యా తెలుసుగాదూ ?"

"ఆఁ !"

"సరే, అక్కడే, ప్రయత్నించి చూడు !"

"నేను ?"

"ఔను ! నువ్వే !"

"ఆమెనా ? అది నాకో లెక్కా ? థూత్ !"

"చూస్తాం కదూ !"

"మీరే చూస్తారులే ! హ్హాఁ ! హ్హాఁ ! హ్హాఁ !"

"ఆమె నీ మొహాన..."

"నాకో నెలరోజులు గడువు !"

"ఏం డబ్బాలు కోస్తావు, నువ్వు !"

"పోనీలే ! పదిహేనురోజులు చాలు ! ఋజువుచేస్తా ! ఎవరన్నావు ? టాన్యా ! థూత్ !"

"సరే, పోరా ! దారిలో అడ్డంలే !"

"పది హేనురోజులు—చాలు ! పని జరిగిపోతుంది ! ఆఁ ! నువ్వా..."

"బైటికి ఫో ! వినిపిస్తూంటా !"

మేస్త్రీకి ఉన్నట్టుండి మహాకోపం వచ్చేసింది—పోవెల్ పైకెత్తి, ఝళిపించేసరికి సోల్జరు తెరచి మొహం వేసి, తూలుతూ తప్పుకున్నాడు. మాకేసి చూస్తూ, ఒక్కక్షణం ఆగి, మెల్లిగా, కసిగా అన్నాడు.

"అహాఁ! అట్లాగా! ఐతే సరే!"

ఈ పేచీ జరుగుతూన్నంతసేపూ మేము తన్మయులమై వింటూ, మౌనంగానే వుండిపోయేం. సోల్జరు వెళ్ళిపోగానే అందరం ఒక్కసారిగా బిగ్గరగా మాట్లాడనారంభించేం.

మాలో ఒకడు మేస్త్రీ నుద్దేశించి, అన్నాడు :

"నువ్వు చేసినపనేం బాగులేదు, పావెల్!"

"నీ పనేదో చూసుకో!" అని క్రోధంతో అరిచేడు, మేస్త్రీ.

సోల్జరుకు బాగా నషాలం అంటిందనీ, టాన్యాకి ప్రమాదం దగ్గర్లోనే వుందనీ మేం పసికట్టేం. కాని అదే సమయంలో యింకో కుతూహలం మమ్మల్ని కాలుస్తూంది. ఏం జరుగుతుంది? సోల్జరు మీద టాన్యా వ్యామోహపడకుండా నిలువగలుగుతుందా!

"టాన్యా వీడికి లొంగడమా? ఛా! ఆమెని పట్టడానికి ఎవడితరం! వీణ్ణి తిరస్కరించి తీరుతుంది!"

అందరం ఏకకంఠంగా, గాఢవిశ్వాసంతో అరిచేం. అదే మా ఆశ, మా మధురస్వప్నం.

మా దేవత యొక్క శక్తి పరీక్షించాలని మాలో తీవ్రమైన ఆకాంక్ష బైలుదేరింది. మా దేవత అలౌకికశక్తిమంతురాలనీ, ఈ అగ్నిపరీక్షలో జయమంది దుర్నిరీక్ష్యంగా బయల్పడుతుందనీ ఒకర్నొకరం విశ్వసింపచేయడానికి మేము చాలా ప్రియత్నించేం. ఇదెంతవరకు పోయిందంటే సోల్జరును యింకా పురెక్కించి వుండాల్సిందనీ; వాడు యీ పేచీ మరిచిపోతాడేమోననీ మాకు సందేహం కలిగింది. ఆరోజు మొదలుకొని మా జీవితమే మారిపోయింది. అననుభూతపూర్వమైన మానసికాందోళనా, నరాల్ని నమిలే ఆతృతా మాలో ప్రవేశించింది. ఒకరితో ఒకరం వాదిస్తూ రోజులు రోజులే గడిపేవాళ్ళం; మా తర్కబలం నైశిత్యాన్ని బొందింది; ఆరోజుకారోజు మా సంభాషణాపటుత్వమూ హెచ్చింది. మేం రాక్షసులతో పందెం కాస్తూన్నట్లూ, అందులో టాన్యాను పణం ఒడ్డినట్లూ అనిపించేది. సోల్జరు టాన్యాను వెంటాడుతూన్నట్లు విన్నపుడు మాలో మధురమైన భీతి అంకురించి, మా జీవితాలు యెంతో కుతూహలకరంగా కనిపించేయి. మేము పరధ్యానంగా వున్నట్లు కనిపెట్టి మా యజమాని రోజూ కలిపే పిండిని మూడువందల పౌనులదాకా హెచ్చించేడు. కాని అంత బరువుపని చేస్తూ కూడా మేం అలిసిపోలేదు. అసలు పనియెక్కువ చేసేదనే సంగతే మేం గమనించలేదు! రోజంతా టాన్యాపేరు మా నాలికచివరే వుండేది. ప్రతీదినం మేము ఆమె రాకకోసం ఓ రకమైన ఆదుర్దాతో నిరీక్షిస్తూండేవాళ్ళం. ఒక్కొక్కప్పుడు

టాన్యా మా దగ్గరికి వచ్చినట్లూ, ఆమె యెంతో యిదిగా మారిపోయినట్లూ మా మనోనేత్రం ముందు కనిపించేది. మాలో యింత రభస జరుగుతూన్నా ఎవ్వరమూ ఆమెని గురించిన యీ పేచీని వెల్లడిచేయలేదు. ఐనప్పటికీ మా వైఖరిలో ఏదో మార్పు రానేవచ్చింది. అదివరదాకా టాన్యా అంటే మా కున్న అమాయికప్రేమ స్థానంలో తీవ్రమైన కుతూహలం, చురకత్తిలాటి తీక్ష్ణమైన పరీక్షాదృష్టీ పాదుకున్నాయి.

"నేస్తాలూ! ఈవేళతో గడువాఖరు!" అన్నాడు మేస్త్రీ ఓరోజు వుదయం పనిలో కూర్చునీముందు.

ఆ సంగతి మాకు వాడు చెప్పకుండానే తెలుసు. కానీ! అని మేమూ జాగ్రతగానే వున్నాము.

"ఆమెని పరిశీలించి చూడండేమి? ఇప్పుడే వస్తాంటుంది, టాన్యా!" అన్నాడు మేస్త్రీ.

"ఎందుకూ? చూస్తే తెలుస్తుందా ఏమిటి అది? అది గ్రహించాలంటే కళ్లు కాదు కావలసింది!" అన్నాడు మాలో ఒకడు, బెరుకుతో.

ఆదుర్దాగా, బిగ్గరగా వాద ప్రతివాదాలు రేగినాయ్. మా ఆరాధ్య దేవతయొక్క గొప్పతనం, నిష్కళంకత్వం, ఆ రోజే నిర్ధారణ అవుతుంది. మా అందరిలోనూవున్న నిష్కల్మష పవిత్రగాఢాభిమానాన్ని ఏ వ్యక్తియం దారోపించేమో, ఆ వ్యక్తి శీలనిర్ధారణ నేడే! మా పందెపువిలువ అప్పుడే

మాకు తెలిసివచ్చింది. శీలనిర్ధారణకు బోయి అసలు మా దేవ తనే కోల్పోయే ప్రమాదం దాపులోనే వుందని గ్రహించి వణికిపోయేం.

ఇన్నాళ్ళనుంచీ సోల్జరు పట్టుదలగా నిరంతరం టాన్యాను వెంటాడుతూన్నాడని వింటూనే వున్నాం. కాని వాణ్ణి గురించి టాన్యా అభిప్రాయమేమిటో అడగాలని మాలో ఒక్కడికీ తోచనేలేదు. టాన్యా మాత్రం యధాప్రకారంగానే బిస్కట్లకి రోజూ వస్తూనేవుంది. ఆమె వైఖరిలో మార్పేమీ మాకు కనిపించలేదు.

ఆ రోజు వుదయంకూడా టాన్యా కంఠం బైటనుంచి వినపడింది. "ఏం, ఖైదీలూ! ఏం చేస్తున్నారు? నే వచ్చా!"

తలుపు తొందరగా తెరిచేం. కాని, మామూలుకు భిన్నంగా అందరం మౌనంగానే వుండిపోయేం. మా అందరి కళ్ళూ ఆమె మీదే వున్నాయి. ఆమెతో యేంమాట్లాడాలో, ఏమి అడగాలో మరిచే పోయేం. గుంపుగా, మౌనంగా, ఎర మరికగా ఆమెఎదట నిలబడిన మమ్మల్ని చూసి టాన్యా తెల్ల బోయింది. కంగారుపడుతూ, గద్దదికగా ప్రశ్నించింది, మమ్మల్ని:

"ఇదేమిటి ? మీరు...యివాళ...యిట్లావున్నా రేం?"

"మరి నువ్వో?" దృష్టి ఆమెమీదేవుంచి, కటువుగా విసిరేడు మేస్త్రీ, ఎదురుప్రశ్నని.

"నేనేమిటి ?"

“"ఏమీలేదు !”

“అయితేసరే! బిస్కట్లు యివ్వండి త్వరగాపోవాలి!”

అదివరకెప్పుడూ ఆమె మమ్మల్ని తొందరచెయ్యలేదు.

“ఫరవాలేదు. బోలెడుటైముంది!” అన్నాడు మేస్త్రీ కదలకుండానే. అతడి దృష్టి టాన్యామీదే వుంది.

హఠాత్తుగా టాన్యా గిరుక్కున తిరిగి బైటికి వెళ్ళిపోయింది. మేస్త్రీ షోవెల్ చేతిలోకి తీసికొని, పొయ్యివైపు నడుస్తూ, అన్నాడు :

“సరే, అర్థమయింది! చివరకి సోల్జరుతోనా! వెధవ! కుక్కలకొడుకు!”

మేకలమందలా మేమందరం టేబిలుచుట్టూ మూగి నిశ్శబ్దంగా కూర్చుని, పని ప్రారంభించేం. కాని, కొంచెం సేపట్లోనే మాలో ఒకడు మొదలెట్టేడు :

“బహుశా, యింతకీ ఏమీ...”

‘నోరుముయ్!” అరిచేడు గద్దిస్తూ, మేస్త్రీ.

మేస్త్రీ మా అందరిలోకీ తెలివైన వాడనీ, అనుభవజ్ఞుడనీ మేము ఎరుగుదుం. అతని కంఠాన్నిబట్టే సోల్జరు నెగ్గాడని గ్రహించి, సగం చచ్చిపోయినట్లే ఐపోయేం. మాలో వుత్సాహం ఏ కోశానా లేదు.

మధ్యాహ్నం పన్రెండయింది. మేము భోజనాలు చేస్తూండగా వచ్చేడు, సోల్జరు. ఇదివరకులాగే నీటుగా, హెచ్చరికగా వున్నాడు. లోపలి వస్తూనే వాడు సూటిగా

మా కళ్ళల్లోకి చూస్తూంటే వాడిచూపులు భరించలేక మేము ముఖాలు తిప్పేసుకున్నాం.

"ఏమండీ, దొరలు! సోల్జరు తడాఖా చూపెట్టమంటారా ఏమిటి?" అంటూ గర్వంగా నాలిక తాటించేడు.

"అదుగో! ఆ వసారాలోకి వెళ్లి తలుపుకన్నంలోంచి చూస్తూండండి! తెలిసిందా?"

మేమందరం ఏమీ మాటాడకండానే వసారాలోకి మూగి, ఒకణ్ణొకడు తోసుగుంటూ చెక్కలగోడ కన్నాలగుండా చూస్తూన్నాం. అక్కడనుంచి దొడ్డంతా కనిపిస్తుంది. మేం వెళ్ళిన కొంచెం సేపటికే టాన్యా తొందరగా నడుస్తూ ప్రత్యక్షమైంది. ఆమె ముఖంలో ఆతురతా, ఆశా స్ఫుటంగా వున్నాయి. బురదనీ, మంచునీటినీ తప్పుకుని నడుస్తూ, ఓ కొసగావున్న కొట్టుగదిలోకి మాయమైంది, టాన్యా. ఆ వెంబడే తీరిగ్గా యీల వేసుకుంటూ, తాపీగా నడుస్తూ సోల్జరు వెళ్లేడు. వాడి చేతులు కోటుజేబుల్లో వున్నాయి, గాలికి మీసాలు కదులుతున్నాయి.

వర్షంకురుస్తూంది. వానచినుకులు నీటిగుంటల్లో పడడం, తరంగాలుగా నీరు కదలడం కనిపిస్తూనేవుంది. మబ్బువేసి ఆకాశం అంతా ధూసరవర్ణంగా వుంది. చెమ్మగాను, చలిగాను వుంది, వాతావరణం. ఇంటికప్పులమీద మంచు యింకా అట్లాగే వుంది. నేలమీదమాత్రం నల్లటి బురదగుంటలు అప్పుడే ఏర్పడుతున్నాయి. ఇళ్ళకప్పులమీది మంచు బురదకొట్టుకుని వుంది.

మనస్సుని నిరుత్సాహంలో ముంచుతూ వాన మెల్లగా సైం! మని కురుస్తోంది. అక్కడ నిరీక్షిస్తూ కూర్చోడానికి మా కెంతో అసహ్యంగా, బాధగావుంది.

ఆ కొట్టుగదిలోంచి తిరిగి బైటికి రావడంలో సోల్జరే ముందు వచ్చేడు. మీసం మెలితిరిగి కదులుతూంది. చేతులు కోటుజేబుల్లో పెట్టుకుని ఈలవేస్తూ, -యథాప్రకారంగానే తీరికగా నడిచివస్తూన్నాడు, పెరటి కడ్డుపడి.

తరువాత టాన్యా వచ్చింది. ఆమెకళ్ళు సంతోషంతోనూ, సుఖంతోనూ మెరుస్తూన్నాయి. పెదవులమీద చిరునవ్వు మసలుతూంది. నిద్రలోలాగ తూలుతూ, తడబడుతూ, మెల్లిగా నడిచి వస్తూందామె.

దీన్నంతనూ చూస్తూ, భరించలేకపోయేం. అందరం ఒక్కసారిగానే తలుపువైపు పరుగెత్తి, పెరట్లో పడ్డాము. టాన్యాని వెక్కిరిస్తూ, కసికొద్దీ బుసలుకొట్టేం. బిగ్గరగా, కోపంగా ఆమెని నానామాటలూ అని తిడుతూంటే ఆమె ఉలిక్కిపడి వింటూంది. మమ్మల్నందర్నీ చూసి, బురదలో పాతుకుపోయిన దానిలా అట్లాగే నిలబడిపోయింది, నిశ్చేష్టురాలై. మేము ఆమె చుట్టూ నిల్చుని అసూయతో బూతులు తిడుతూ, లజ్జాకరమైన అసభ్యపదజాలాన్ని వల్లించేం.

ఆమె మామధ్య చిక్కుకుంది. తప్పించుకునిపోయే మార్గంలేదు. అంచేత తాపీగా, తనివితీరా తిట్లు సాగించేం. ఆమెని మేం ఎందుకు కొట్టలేదో నాకు తెలియదు. మా మధ్యనే

తిట్లు వచ్చినవైపు ముఖం అటునిటు తిప్పుతూ నిలబడింది, టాన్యా. ఆమె నిస్సహాయస్థితి చూచి మా తిట్లూ, బూతులూ మరింత జోరుగా, కసిగా కురిసేయి.

టాన్యా ముఖం వివర్ణమైంది. ఇంతకు ముందే సుఖ సంతృప్తిపూర్ణములై అర్ధనిమీలితములై వున్న నీలికళ్ళు భయంతో విప్పారినాయి. బరువుగా వచ్చే ఉచ్ఛ్వాసనిశ్వాసాలతో గుండెలదురుతున్నాయి; పెదవులు వణుకుతున్నాయి.

మేము చుట్టూ నిలబడి, మమ్మల్ని దోపిడీ చేసినందుకామెపై కసితీర్చుకున్నాం. ఆమె మాది; మాలోని ఉత్తమమైన భావాలకీ, ప్రేమకీ ఆమె పాత్రురాలైంది. మాలో ఉత్తమమైనవే వర్థిల్లి చెత్త గావచ్చును. ఐనా మేము యిరవైఆరుగురం వున్నాం; ఆమె ఒక్కతె. అంచేత ఆమె తప్పుకి తగిన శిక్షని ఆమెకి మేము యివ్వలేకనే పోయేం! ఆమెని యెల్లా అవమానించేమని! అన్నిటికీ ఆమె మౌనంగా వూరుకునేవుంది. బెదరిన నేత్రాలతో చూస్తూ, వణుకుతూ, అక్కడే నిల్చిపోయింది.

నవ్వేం, అరిచేం, కూతలు కూసేం. ఇంకా యితరులు కూడా చాలమంది పోగయేరు, అక్కడికి. మాలో యెవడో ఆమె బ్లౌజు పట్టుకు లాగేడు.

ఉన్నట్టుండి, టాన్యాకళ్ళు నిప్పులు కురిసేయి. ఉద్దేశపూర్వకంగా రెండుచేతులూ యెత్తి, జుట్టు సరిచేసుకుంటూ, బిగ్గరగా, శాంతంగా మా మొహాలమీదే,—

"ఛీ! బానిసవెధవల్లారా!" అంటూ మేమెవరమూ అక్కడ లేనట్లుగా మా మీదికే నడిచివచ్చేసింది. ఎవరమూ ఆమె నడ్డగించలేదు. మా మధ్యనుంచి నడిచి వెళ్లిపోతూ, వెనకతిరిగి చూడకండానే బిగ్గరగా, ధైర్యంగా, గర్వంతో, చెప్పరానంత అసహ్యంతో,—

"ఛీ! ఛీ! పురుగులు! పశువులు! అవే నయం!"

అనేసి, గర్వంగా, అందంగా, నిదానుగా నడిచి వెళ్ళి పోయింది.

మేమూ దొడ్లోనే, వర్షంలో, సూర్యుడులేని ధూసరాకాశం కింద నిలబడిపోయేం.

కొంచెంసేపట్లో మెల్లిగా, మౌనంగా మేమూ మా చీకటి రాతిగదికి నడిచి వెళ్ళిపోయేం. సూర్యుడు మళ్ళీ మాగదిలోకి తొంగిచూడలేదు. టాన్యా కూడా మళ్ళీ రాలేదు, ఎన్నడూ.



# మా రోజుల్లో ఎరుగం!

జినోవా రైలుస్టేషన్‌కు యెదురుగా వున్న మైదాన మంతా జనంతో నిండిపోయింది. మధ్యమధ్య ఒకడూ అరా కాస్త మంచిగుడ్డలతో, పోషణలో వున్నట్లు కనబడుతూన్నా మొత్తంమీద అక్కడున్న వాళ్ళంతా కార్మికులే. మునిసిపల్ కౌన్సిలర్లు అందరికన్నా ముందు నిలబడి వున్నారు. పెద్ద జండా ఎర్రసిల్కుది, వాళ్ళ తలలపైన యెగురుతూంది. దానిప్రక్కనే అనేక కార్మికసంస్థల పేర్లు వ్రాసిన రంగురంగుల బానర్లు రెప రెపలాడుతూన్నాయి. సిల్కుగుడ్డల జరజరలు, ప్రజాసమూహపు మర్మరధ్వనులు మేళవించిపోయి, యేదో పెద్ద ఆర్కెస్ట్రా దూరంలో మంద్రస్థాయిలో ఆలాపన చేస్తూన్నట్లు వినబడు తూంది. ప్రజాసమూహానికి మధ్యలో బాగా యెత్తుగా, ఒక పెద్ద దిమ్మమీద కొలంబసు చలువరాతి విగ్రహం కనబడు తూంది. కొలంబసు తన భావాలు నిరూపణ చేసుకొనేందుకు యెన్నో బాధలు పడ్డాడు. చివరకి ఆయన ఆత్మవిశ్వాసమే ఆయనకు విజయాన్ని చేకూర్చింది. ఇప్పటికీ ఆ చంద్రకాంత శిలావిగ్రహంవైపు చూస్తే, ఆ పెదవులు 'విశ్వాసం గలవారికే విజయం' అంటూన్నాయా అనిపిస్తుంది.

బ్యాండు వాళ్ళు యిత్తడిబూరాలను కొలంబసు తిన్నె చుట్టూ జేరబెట్టేరు. ఆ యిత్తడిబూరాలు ఎండవెలుతురులో బంగారపు బూరాల్లా తళతళా మెరిసిపోతున్నాయి. చలవ

రాతితో అర్థచంద్రాకారంగా కట్టిన జినోవా స్టేషన్ రెండు కొసలూ మైదానంయొక్క రెండువైపులకూ పొడుచుకువచ్చి, అక్కడి ప్రజల్ని కౌగలించుకోబోతూన్నాయా! అనిపిస్తూంది. రేవులోనుంచి ఓడయంత్రాల కస్స్–బుస్స్ లు, పంకాల ఝుంకారాలు, గొలుసుల గలగలలు, ఈలలు, కేకలు కలిసి పోయి వినబడుతున్నాయి.

మైదానంలో కూడా గాలి ఆడ్డంలేదు. చాలా ఉక్కగా వుంది. సూర్యకిరణాలు చురుక్కుమనిపిస్తూన్నాయి.

చేతుల్లో పూలగుత్తులు పట్టుకొని స్త్రీలు గుంపులుగా మేడలమీది బాల్కనీలనుంచీ, కిటికీలనుంచీ తొంగి చూస్తున్నారు. వారి దగ్గరగానే రంగురంగుల గౌనులు తొడుక్కుని నిలుచున్న చిన్నపిల్లలు పెద్ద పువ్వులగుత్తుల మాదిరిగా కనిపిస్తూ, కనులపండువుగా వున్నారు.

కైఁ! మంటూ యీలకొట్టుకుంటూ యింజన్ స్టేషన్ లోకి దూసుకుని వచ్చింది. ఆ కూత మైదానంలోని ప్రజల్ని ఉరూతలూగించింది. ఉత్సాహం పట్టలేక ప్రజలు యెగురవేసిన పాతటోపీలు గాలిలో మాలకాకుల్లా యెగిరేయి. బ్యాండువాళ్ళు తమ సాధనాలు తీసుకుని సిద్ధంగావున్నారు. వయసుమళ్ళిన పెద్దలు కొందరు గంభీరంగా ముందుకు నడిచి, గొంతుచించుకుని, హస్తవిన్యాసపూర్వకంగా యేదో బిగ్గరగా చెపుతూన్నారు.

మహాకష్టంమీద జనసమూహం అటూయిటూ తప్పుకుని, మధ్య విశాలంగా పాయవదిలింది.

"ఎవరా వస్తూన్నది?"

"పార్మాకార్మికుల పిల్లలు."

పార్మానగరంలో కార్మికులు సమ్మె చేస్తున్నారు. రోజులూ, వారాలూ గడుస్తూన్నా యజమానులు దిగి రాడం లేదు. కార్మికులు చాలా యిబ్బందులు పడుతూన్నారు. అంచేత తిండిలేక మాడిపోతూన్న తమ బిడ్డలందర్నీ జినోవా నగరంలోని తమ సోదరకార్మికుల దగ్గిరకి పంపేస్తూన్నారు.

స్టేషనులోని స్థంభాల వరుసలమధ్యనుంచి బారులుతీరి వస్తూన్న పిల్లలు ఊరేగింపులా కనబడుతూన్నారు. ఒక్కడి వంటిమీందా సరైన గుడ్డలేదు. తలలుమాసి, జుట్టు రేగిపోయి, చింకిరిగుడ్డల్లో బికారీల్లా వున్నారు వాళ్ళు. వరస కై దేసిమంది చొప్పున చెట్టాపట్టాలు పట్టుకుని నడిచి వస్తూన్నారు. వాళ్ళందరూ చిన్నపిల్లలే. బూడిద కొట్టుకుని, అలసిసొలసి వున్నా ముఖాలు గంభీరంగానూ, కళ్ళు నిర్మలంగా అమాయికంగానూ వున్నాయి. వాళ్ళకి స్వాగతం యిస్తూ, బ్యాండువాళ్ళు 'గారిబాల్డీ విజయగీతం' ఆలాపించే సరికి ఆకలికి వాడిలిన ఆ లేత ముఖాలమీద సంతోషం తొణికిసలాడింది.

ప్రజలు బ్రహ్మాండాన్ని బ్రద్దలుచేసే ఉత్సాహ ధ్వనులతో యీ భావిపౌరులకు స్వాగతం యిచ్చేరు. వారిని 'రారమ్మని' సైగ చేస్తూ జెండాలు రెపరెప లాడేయి. తమకి స్వాగతమిచ్చే ఆ ప్రయత్నాలను చూసి, బిడ్డలు దిగ్భ్రమ జెందేరు. ఒక్క క్షణం కంగారుపడి, అంతలోనే సర్దుకుని,

వెన్ను విరిచి నిలబడ్డారు. ఆ క్షణంలో వాళ్ళు ఆరిందాలుగా కనబడ్డారు! ఒకే హృదయం వేయి గొంతులతో పలికినట్లుగా,—

"ఎవ్వీవా ఇటాలియా!" (ఇటలీ వర్థిల్లాలి!) అంటూ నినాదా లిచ్చేరు.

"పార్మా బిడ్డలు వర్థిల్లాలి!" అని ప్రజాసమూహం ఒక్క గొంతుతో దిక్కులు పిక్కటిల చేసింది.

"ఎవ్వీవా గారిబాల్డీ!"

మళ్ళీ బిడ్డల నినాదాలతో ఆకాశం దద్దరిల్లింది. క్రమంగా జనం బిడ్డలగుంపును కమ్ముకున్నారు. ఆ మహాసమూహంలో బిడ్డలు కలిసిపోయేరు.

కిటికీలు, బాల్కనీలు, మిద్దెలుమీదనుంచి తెల్లని పావురా లెగురుతూన్నట్లు జేబురుమాళ్ళు ఊగినాయి. ఉత్సాహ ధ్వనులతో ఊరేగింపుమీద పూలవాన కురిసింది.

ఆ రోజున అన్నిటికీ పండుగకళ వచ్చింది. ప్రతీదీ సజీవంగా సుందరంగా వుంది. చలువరాతి కట్టడాలమీది నీడలు, వెలుతురు పొడలు పూలగుత్తుల్లా కనబడుతూన్నాయి.

చల్లగాలిలో జెండాలు రెపరెప లాడుతున్నాయి. పువ్వులూ, టోపీలూ, జేబురుమాళ్ళూ గాలిలో యెగురుతున్నాయి. ఉన్నట్లుండి చిన్నబిడ్డల తలలు ప్రజాసమూహానికి పైన అక్కడక్కడ కనబడసాగేయి. ఎగురుతూన్న పువ్వుల్ని పట్టుకోడానికై వాళ్ళ చిన్ని చేతులు గాలిలో ఆడుతూంటే, నినాదాలతో దిక్కులు మార్మోగుతున్నాయి.

"ఎవ్వీవా ఇల్ సోజలిజ్మో!"

"ఎవ్వీవా ఇటాలియా!"

"సోషలిజం వర్థిల్లాలి! ఇటలీ వర్థిల్లాలి!"

కొంచెం సేపట్లోనే అందరు పిల్లల్నీ తలొకరూ భుజాల మీదకు యెత్తేసుకున్నారు. పజాసముద్రంలో తేలియాడు తూన్నట్లుగా వాళ్ళ చిన్నిముఖాలు పైన కన్పించుతూన్నాయి. గంభీరమైన ముఖాలూ, పెద్దమీసాలూ పిల్లల నదుముకుంటు న్నాయి. నవ్వులు, కేకలు, గోలాలో బ్యాండు ధ్వనులు విన బడడమేలేదు. పిల్లలను తలాఒకరూ తీసికొని వెళ్ళడానికై మేడలూ, మిద్దెలూ దిగి వస్తూన్న స్త్రీలు సందడిగా మాట్లాడు తూన్నారు.

"అనీతా! నువ్వు యిద్దర్ని తీసికెడుతూన్నావా?"

"ఔను. నువ్వో?"

"కుంటిమార్గరితా ఒకణ్ణి తీసుకు రమ్మంది."

ఉత్సాహోద్రేకాలందరి ముఖాల్లోనూ ప్రతిబింబిస్తూ న్నాయి. పండుగల్లో పాల్గొంటూన్నట్లు అందరిముఖాలూ కల కలలాడుతున్నాయి. ఆడవాళ్ళందించిన రొట్టెల నా బిడ్డలు నములుతూంటే అందరికళ్లూ చెమ్మగిలినాయి.

గద్దముక్కులాంటి పొడుగాటి ముక్కుతో, ఒక ముసలి వాడు పళ్ళమధ్య నో పొడుగాటి చుట్టకరచిపట్టి, ప్రక్కవాడితో అంటున్నాడు.

"మా రోజుల్లో యిట్లాంటి వెరుగం!"

"ఈ పద్ధతి ఎంత బాగుంది!"

"ఎంత సులభం......ఎంత తెలివి!"

ముసలివాడు నోట్లోంచి చుట్టతీసి, దానివైపు పరీక్షగా చూస్తూ, నిట్టూర్పు విడిచి ఉంగరపు వ్రేలితో నుసిమీటేడు. అక్కడికి దగ్గరలోనే అల్లంతలో యిద్దరు పార్సీబాలురు కనిపించేరు. వృద్ధుడు వారివైపు ఒక్కనిమిషం నిదానంగా చూసేడు. ఆ బిడ్డలిద్దరూ ఆశ్చర్యంగాచూస్తూ నిలబడిపోయేరు. ముసలివాడు తలమీదిటోపీని ముందుకు కళ్లమీదికంటా లాక్కుని, దోబూచు లాడుతున్నట్లుగా చేతులు జాచేడు. అదేమిటో అర్థంకాక ఆ పిల్లలు ఒకరికొకరు ఒత్తుకుంటూ, జంకుతో వెనక్కితగ్గేరు. ఈసారి ముసలివాడు మోకరిల్లి, చేతులు నేలకానించి, కుక్కలా మొరగనారంభించేడు. పిల్లవాళ్లు సంతోషముతో గంతులువేస్తూ చప్పట్లు కొట్టనారంభించేరు. వృద్ధుడు సావధానంగా లేచి, అంతటితో తనపని తీరిపోయినట్లుగా వెనుదిరిగి తూలుతూ వెళ్లిపోయేడు.

తలనిండా వెండితీగల్లాంటి వెంట్రుకలతో ఒక గూని ముసిలిది కొలంబసు విగ్రహసమీపంలో నిలబడి, చిరుగుల కొంగుతో కళ్లు ఒత్తుకుంటూంది. ఇంత ఉత్సాహపూరితమైన జనసమూహంలోకి వికారంగా, మలినంగా, మ్లానంగా ఆమె ఒక్కర్తే, వేలెత్తి చూపినట్లుగా కనబడుతూంది.

వదులై భుజంమీదికి జారిపోతున్న టోపీ, కర్రిచెప్పులుతోవున్న ఏడేండ్లకుర్రివాని చేయిపట్టుకుని ఒక యువతి నడుస్తూంది. టోపీ సరిచేసుకోడానికి కుర్రివాడు మాటిమాటికి తల యెగురవేస్తూనే వున్నా, మళ్ళీమళ్ళీ అది జారి భుజాలమీద పడుతూనేవుంది. అంతలో ఆ యువతి, పిల్లవాని టోపీని తీసి

అతని కందకుండా యెత్తున పట్టుకుని, పాట ప్రారంభించింది. పిల్లవా డామె కళ్ళలోకి చూస్తూ ఒక్కక్షణం నిలబడి, టోపీ అందుకోడానికై గెంతడం ప్రారంభించేడు. ఆడుకుంటూనే కొంచెం సేపట్లో ఆయిద్దరూ వెళ్ళిపోయేరు.

బలమైన పెద్దచేతు లూపుకుంటూ పొడుగాటి కార్మికు డొకడు ఆరేళ్ళపిల్లను భుజంమీద కూర్చోబెట్టుకుని నడుస్తూన్నాడు. అతని ప్రక్కనే గెంతుతూన్న రాగి జుత్తు బాలుణ్ణి ఒకణ్ణి చేయి పుచ్చుకుని నడుస్తూం దొకస్త్రీ.

"చూసేవా! ఇట్లాటి వాటికి అలవాటు పడ్డామంటే మనల్ని యెవడూ జయించ లేడు! ఏమంటావు?" అంటూ ఆతడు అట్టహాసంగా నవ్వేడు. ఆ యువతి యేమీ మాట్లాడ లేదు. తన బుజంమీది చిన్నపిల్లని గాలిలోకి యెగురవేసి పట్టుకుంటూ,—"ఏవ్వీవా-పార్......మా!" అంటూ బిగ్గరగా అరుస్తూ సాగిపోయే డాతడు.

ప్రజల్లో చాలామంది తలా ఒక బిడ్డనీ వెంటబెట్టుకుని తీసుకుపోతున్నారు. కొంచెం సేపట్లో వాడిపోయిన పువ్వులూ, చిరిగిన మిఠాయి పొట్లాలూ, హడావిడిగా తిరిగే రైల్వే కూలీలూ, అన్నిటికీ మీదుగా నూతన ప్రపంచాన్ని కనిపెట్టిన ఆ మహనీయుని విగ్రహమూ అక్కడ మిగిలేయి.

నూతన జీవితాన్ని ఆహ్వానిస్తూన్నట్లూ, నిర్మిస్తూన్నట్లూ తెలుసుకొన్న వాలంటీర్ల! నినాదాలు మేగాఫోనుల్లోంచి జినోవా వీథుల్లో ప్రతిధ్వనిస్తూన్నాయి.



# తల్లి పేగు

వీరమాతలైన తల్లుల్ని గురించి చెప్పాలంటే యెన్ని కథలో వున్నాయి. వీరమాత అనిపించుకోవడం ఏతల్లి కానందం కాదు? ఐనా కొన్ని ప్రత్యేక సందర్భాల్లో వీరులైన పుత్రులు తల్లులకి కడుపుచిచ్చు రగిల్చినవాళ్ళూ వున్నారు.

ఎన్నో వారాలనుంచి శత్రుసేన లా పట్టణాన్ని చుట్టు ముట్టి వున్నాయి. రాత్రులు శత్రుసైనికులు వేసుకొనే నెగళ్లు, చుట్టూ వున్న కారుచీకట్లను చీల్చుకొంటూ పట్టణంవైపు యెర్రబారి చూస్తూన్నట్లున్నాయి. నగరవాసుల హృదయాల్లో శత్రువుల నెగళ్లు చీకట్లను వ్యాపింపచేస్తూ, వెలుగుతున్నాయి.

శత్రుసేనలు అంతకంతకు దగ్గరగా కమ్ముకుని వస్తూం డడం కోట గోడలమీదనుంచి పట్టణప్రజలు చూస్తూన్నారు. రాత్రిళ్ళు నెగళ్ళప్రక్క నీలినీడలు అటూయిటూ కదులు తూండడం కూడా కనిపిస్తూంది. తృప్తిగా మేసిన గుర్రాల సకి లింపులు, ఆయుధాల ఝుణఝుణలు, విజయగర్వంతో వున్న సైనికుల పాటలు, వాళ్ళ కేరింతాలూ కూడా వినిపిస్తూ న్నాయి. శత్రువుల పాటలూ, అట్టహాసాలూ వింటూంటే యెవరికి బాధ కలుగదు?

పట్టణ ప్రజలకు ఏకైక జలాధారమైన నదిలో శవా లను తోసి, కుళ్ళబెట్టి నీరు పనికిరాకుండాచేసేరు, శత్రువులు. నగరంచుట్టూ వున్న ద్రాక్షతోటలు తగులబెట్టేరు; పొలాలన్నీ

తొక్కించి నాశనం చేసేరు; పైర్లు గుర్రాలచేత మేపించేరు; పండ్లతోటలు నరికించేరు. ఏవైపు చూసినా కనుచూపు మేరలో ఏమీ లేకండా చేసేసేరు. క్రమంగా యుద్ధ యం త్రాల్ని దగ్గరికి తెచ్చి, వాటితో కోటగోడల లోపలికి పెద్ద బండల్నీ, మంటల్నీ విసురుతూ సర్వనాశనం చేస్తూన్నారు. లోపలికి ఆహారపదార్థాలను పోనీక ఆపేసేరు. నిరంతర శ్రమతో అలిసిపోయి, అర్థాకలి తిండితో సోలిపోయివున్న నగరరక్షకసైన్యం నిశ్శబ్దంగా, యిరుకు వీధుల్లో పడిపోతూంది. గాయపడ్డవాళ్ళ మూలుగులు, సంధి పేలాపనలు, స్త్రీల దైవ ప్రార్థనలు, బిడ్డల యేడ్పులు కలిసిపోయి, ప్రతీ యింటినుంచీ వినబడుతూన్నాయి. ఎవ్వరూ నోరువిప్పి, గట్టిగా మాట్లాడ్డం లేదు. చీకటిమాటున శత్రువు ముందుకు సాగిరావడం లేదు గదా ? యని ప్రతి చిన్న ధ్వనినీ చెవులు రిక్కించి వింటూన్నా రందరూ.

రాత్రిళ్లు గడవడం మరీ దుర్భరంగా వుంటూంది. నిశీథి నిశ్శబ్దంలో యేడ్పులూ, మూలుగులూ మరింత భీకరంగా విని పిస్తూన్నాయి. దూరంగావున్న పర్వతలోయలనుండి శిథిలావ శేషంగావున్న పట్టణపు గోడలమీదికి నల్లటినీడలు పాకి వస్తూ న్నాయి. రెండు కొండల మధ్యనుంచి విరిగిన డాలు మాదిరిగా క్షీణచంద్రుడు పైకి రా బ్రియత్నిస్తూన్నాడు.

బైట ఎక్కడనుంచీ సాయం వస్తుందనే ఆశకూడా లేదు. లోపల వాళ్లంతా యుద్ధబాధలకీ, తిండిలేమికీ నలిగి

పోయేరు. ఈ గండంగడిచి గట్టెక్కుతామనే ఆశ రోజురోజుకీ క్షీణిస్తూంది. ప్రజలు కోటగోడలమీద నిలబడి మ్లానంగా వున్న చంద్రుణ్ణీ, పర్వతశిఖరాల్నీ, చీకటి లోయల్నీ, సైని కులతో కోలాహలంగా వున్న పర్వతశిఖరాల్నీ చూస్తూన్నారు. ప్రతీదీ వాళ్లకి మృత్యువునే గుర్తుకు తెస్తూంది. మనస్సుకి ధైర్యాన్నిచ్చే ఆశారేఖ యెక్కడా ఆ అనంతాకాశంలో వాళ్లకి కనబడ్డంలేదు.

శత్రువుకి ఆచూకీ యిచ్చినట్లవుతుం దని పట్టణంలోని యిళ్లలోకూడా దీపాలు వెలిగించడం మానేశారు. వీధులన్నీ కాటుక పూసినట్లున్నాయి. ఆ కటికచీకట్లో తలనుంచి పాదాల వరకూ నల్లని ముసుగు వేసుకున్న ఒక స్త్రీ నీటిలో చేపలా నిశ్శబ్దంగా వీధులవెంట తిరుగుతూంది.

ఆమెని చూండగానే ప్రజలు గుజగుజలువోయి, తప్పు కునిపోతారు.

"ఆవిడే!"

"ఆమే!"

ఆమెనిచూసి కొందరు కిటికీడల్లోకి తప్పుకొనేవారు; మరికొందరు ముఖాలు చాటుచేసుకుని గబగబ వెళ్ళిపోతారు.

"దోనా మరియానా! మళ్ళీ వీధుల్లోకి వచ్చేవా? ఎవరన్నా పీకనులిపేసినా అడ్డువచ్చేవాళ్ళుండరు సుమా!"

అని ఆమె యెదురు బడ్డపుడెల్లా హెచ్చరిస్తూంటారు, రక్షణ దళాల నాయకులు.

దళం దాటిపోయేవరకూ దారివొదిలి ప్రక్కగా నిలబడీ దామె. సైనికు లామెవైపు వ్రేలుచూపటానికే గాక చివరకి అటు చూడడానికి కూడా భయపడేవాళ్ళు ! అందరూ ఆమెను, కుష్ఠురోగినిలా తప్పుకుని తిరిగేవాళ్ళు. ఎదుట బడినవాళ్ళు దాటిపోగానే మళ్ళీ ఆమె ఆ చీకటి వీథుల్లో మూర్తీభవించిన మృత్యుదేవతలా తిరిగేది. మూలుగులు, యేడ్పులు, ప్రార్థనలు, విజయాశలేని సైనికుల గోణగోణాలు ఆమెను అన్నివైపులనుంచీ క్రమ్ముకొనేవి.

ఆమె ఆ పట్టణంలోనే పుట్టి, పెరిగి, కాపురం చేసింది. అక్కడే ఆమె కుమారుడూ పుట్టి పెరిగేడు. తను పుట్టిన పట్టణాన్నీ, తను కన్నకొడుకునీ గురించే ఆమె నిరంతరం ఆలోచిస్తూంది. తను కన్నకొడుకు నాయకత్వం క్రిందే శత్రుసైన్యాలు నేడు తను జన్మించిన నగరాన్ని నాశనంచేస్తూన్నాయి.

ఆమె తన కుమారుని చూసి మురిసిపోయింది. ఎంత అందమైనవాడు ! ఎంత చురుకు ! ఎంత ధైర్యం ! తన మాతృదేశానికి అటువంటి పుత్రరత్నాన్నివ్వగలిగినందుకు ఆమె ఎంత గర్వపడింది ! పుట్టిన నగరానికీ, ఆ నగరప్రజలకూ సాయపడగల మహాశక్తిశాలిని కన్నందుకు తన జన్మ సార్థకమైన దనుకొనీది.

ఆ నగరానికీ ఆమెకూ యెడతెగని అనుబంధం వుంది. ఆమె తండ్రి తాతలు, పూర్వులు కట్టుకున్నవే, ఆ యిళ్ళన్నీ.

నగరప్రాకారాలు, బురుజులు వాళ్ళు నిర్మించినవే. ఆ గోడల మధ్యనే తన పూర్వుల ఎముకలు కప్పడి వున్నాయి. ఆ పట్ట ణానికి సంబంధించిన చరిత్రలు, గాథలు, పాటలు, ఆశలు ఆమె కెంతో సన్నిహితాలు. అంత ప్రేమపాత్రమైన వస్తువును కోల్పోయి, బాధపడుతూంది. కుమారునిమీది ప్రేమను, జన్మభూమిమీది ప్రేమను మనస్సులోనే తూచి చూసుకుంది. ఎటు మొగ్గుందో ఆమె హృదయానికే తెలియడంలేదు.

ఎన్నో రాత్రులనుంచి ఆమె నగరవీధుల్లో పిచ్చిదానిలా తిరుగుతూంది. చిరపరిచితులైన యిరుగు పొరుగు వారు కూడా ఆమెను పలకరించరు. తమ పట్టణానికి దాపురించిన మృత్యు దేవతగా భావించి, వైదొలిగిపోయేవారు; ఎవరైనా తారస ప్లినా, దేశద్రోహి తల్లికి గౌరవమెక్కడ! తిరస్కారంగా ముఖం త్రిప్పేసుకుంటున్నారు.

ఆ రోజున పట్టణం చివర, కోటగోడవద్ద ఆమె మరో స్త్రీని చూసింది. ఆస్త్రీ ఒక శవంప్రక్క మోకరిల్లి, ఆకాశం వైపు చూస్తూ, మౌనంగా ప్రార్థన చేస్తూంది. కోటగోడమీద నిలబడ్డ కాపలాదారుల గుసగుసలు వినబడుతూన్నాయి. వాళ్ళ కవచాల రాపిడీ, ఆయుధాల ధ్వనీ, కోటగోడరాళ్ళమీద నడిచే పాదరక్షల చప్పుడూ స్పష్టంగా వినవస్తూన్నాయి.

'నీ భర్తా ?' దేశద్రోహితల్లి అడిగింది.

'కాదమ్మా.'

'నీ తమ్ముడా ?'

'నా కొడుకు. నా భర్త పోయి పదమూడు రోజులే అయింది. నేడు నా కుమారుడు కూడా.'

అంటూ చనిపోయిన వీరుని తల్లి మెల్లగా లేచి నిలబడింది.

'నా కుమారుణ్ణి అనుగ్రహించినందుకు మడోనా*కు సహస్రవందనాలు.'

"ఎందుకు?"

"వాడు దేశంకోసం పోరాడుతూ మరణించేడు. అంచేత నా భయం యిప్పుడు చెప్పుకున్నా సిగ్గుపడనక్కర్లేదు. నా బెదరు తీరిపోయింది. ఎప్పుడూ వీడు సరదామనిషి. కులాసాగా జీవితం గడపాలనే రకం. భోగలాలసతో దేశానికి ద్రోహం చేస్తాడేమోనని యెంతో భయపడేదాన్ని. మరియానా కొడుకుని చూడు. దేవుడికీ, మానవుడికీ కూడా శత్రువై కూర్చున్నాడు. శత్రువులకి నాయకుడు వాడే! వాడి తల్లి కడుపు మాడ!"

మరియానా తల యెత్తలేదు. నోరు మెదపలేదు. తిరిగి వెళ్ళిపోయింది.

మరునాడామె సైన్యాధిపతి దగ్గరకు వెళ్ళింది.

"నా కొడుకు మీకు శత్రువు. అందుచే నన్ను చంపనేనా చంపండి. లేదా వాడిదగ్గరకు పోనివ్వండి."

"అమ్మా! నువ్వూ ఉప్పూ పులుసూ తినేదానవే. నీకూ దేశం అంటే అభిమానం, శత్రువులంటే ద్వేషం వుంది.

* రోమనుల దేవతలలో ఒకతె.

నీకు కొడుకైనా వాడు మాకెంత శత్రువో నీకూ అంతే శత్రువు. నే నెరుగుదును, నిన్ను.” అన్నాడు సైన్యాధిపతి.

“నేను వాడితల్లిని. వాడీ రకంగా తయారు కావడానికి బాధ్యత నాదేనని భావిస్తూన్నా.”

సైన్యాధిపతీ, యితరపెద్దలూ సంప్రదించుకున్నారు. పర్యవసానంగా,—

‘‘మరియానా! నీకొడుకు చేస్తూన్న ఘోరానికి నిన్ను చంపడం న్యాయం కాదు. ఈ పని చెయ్యమని నువ్వేమీ ప్రోత్సాహం యిచ్చి వుండవు. నువ్వుకూడా మనస్సులో యెంతో బాధపడుతూన్నావు. ఆ విషయం మాకూ తెలుసు. నీకొడుకు పనులకి నువ్వు పూచీ పడనక్కర్లేదు. ఆ రాక్షసుడు కన్నతల్లినే మరచి వుంటాడు. నువ్వొకవేళ తప్పుచేసినా యింత కన్న ఘోరమైన శిక్ష వుండనే వుండదు. నువ్వు పడే బాధ మరణంకంటే కూడా భయంకరం!’’ అన్నారు.

‘‘ఔను. ఇది చాలా భయంకరమైన శిక్ష!”

అధికారులు సింహద్వారం తలుపులు తెరచి, ఆమెను పోనిచ్చేరు. కొడుకు చిందించిన రక్తంతో తడిసిన తన జన్మ భూమిని తొక్కుకుంటూ నడుస్తూంటే ఆమె కడుపులో చేయి పెట్టి కలిచినట్లు బాధపడింది. ఆ నగరాన్ని విడిచిపోడానికామె కాళ్ళు సాగడం లేదు. ప్రజలు కోట గోడలమీద నిలబడి ఆమె పోతూన్నవైపే చూస్తూన్నారు. వాళ్ళ చూపులు ఆమెకు వెనుకనుంచి బల్లెములతో పొడుస్తూన్న ట్లనిపించేవి.

దుర్గరక్షణలో ప్రాణాలర్పించిన వీరుల శవాలు కనిపించినపుడల్లా నిలబడి నమస్కరిస్తూ, విరిగిన ఆయుధాలు, మారణసాధనాలూ కనిపిస్తే చూపులు మళ్ళించుకుంటూ ఆమె సాగిపోతూంది. ఆయుధాలంటే ఏ తల్లి హృదయం జుగుప్సాపూరితం గాదు? ఆమె బహు నెమ్మదిగా, చంకనున్న దేదో తొణికి చిందుతుందని భయపడుతూన్నట్లు నడుస్తూంది. అంతకంత కామె మూర్తి చిన్నదై, మరీచిన్నదై, చివరకు అదృశ్యమైంది. ఆమెతో బాటు తమ దురదృష్టంకూడా తొలగిపోయిన ట్లనిపించిం దా ప్రజకి.

చాలాదూరం పోయి ఆమె నిలబడి, మేలి ముసుగు తొలగించి దూరానవున్న తన పట్టణంవైపు తిరిగి చూసింది. శత్రు శిబిరంలో వాళ్ళు కూడా తమవైపు యెవరో నల్లని దుస్తులతో వస్తూండడం గమనించేరు. నెమ్మదిగా యెదురువచ్చి, ఆమె యెవరో, ఎక్కడనుంచి వస్తూందో, ఎక్కడికి పోతూందో అడిగేరు. ఆమె నిష్ఠురంగా జవాబిచ్చింది.

"మీా నాయకుడు నా కొడుకు."

వాళ్లకీ సందేహం కలుగలేదు. కొడుకు ధైర్యసాహసాల్ని పొగడుతూ, అతని పరాక్రమాన్నీ, వ్యూహనిర్మాణ చాతుర్యాన్నీ వర్ణిస్తూ, ఆ తల్లిని వెంబడించి నడుస్తూ, తమ శిబిరానికి గొనివచ్చేరు. తన కుమారుడైన వాడు తద్భిన్నంగా యెప్పుడూ ప్రవర్తించడన్నట్లు సగర్వంగా, ఠీవిగా తల యెత్తుకుని నడుస్తూంది, ఆ తల్లి.

కొంచెం సేపట్లోనే ఆమె తన కుమారుని దగ్గిరికి వచ్చింది. ప్రపంచంకంటే తొమ్మిదినెలలు పూర్వంనుంచే ఆమె ఆతణ్ణి యెరుగును! ఆతణ్ణి ఆమె ఎట్లా మరిచిపోగలదు? అను క్షణం, ఆమె హృదయం, శరీరం అంతతోనూ ఆతణ్ణి ప్రేమించి, లోకపువెలుగు చూపింది. అతడిప్పుడు వీరాధివీరుడు; విలువైన సిల్కులు ధరించి, రత్నాలు పొదిగిన ఖడ్గాదులతో దుర్నిరీక్ష్యంగా వున్నాడు. కాని ఆతడామెకు పిల్లవాడే. ఆతడు భోగభాగ్యాలతో తులతూగాలనీ, కీర్తి ప్రతిష్ఠల నార్జించాలనీ, దీర్ఘాయుష్మంతుడుగా వుండాలనీ ఎందరో దేవుళ్లకు మొక్కుకుంది. ఆ తల్లి కోర్కెలను ఆమె కులదేవతలు విన్నారని స్పష్టంగానే వెల్లడైంది!

ఆతడామె చేతులు ముద్దుపెట్టుకుని, 'అమ్మా అమ్మా!' అని పిలిచేడు.

"అమ్మా! నువ్వు నాదగ్గరకి వచ్చేవు. నన్ను అర్థం చేసుకున్నావు. ఆ దౌర్భాగ్యుల్ని రేపటికే లొంగదీసి, పట్టణాన్ని పట్టుకుంటా."

"నాయనా! నువ్వు జన్మించినదా పట్టణంలోనేనోయ్!" అని జ్ఞాపకం చేసిందా తల్లి.

అతనికి తన బలం తెలుసును. ఆ మదంతో, కీర్తికాంక్షతో, యౌవనపు పొంగుతో పెంకితనంగా ఆతడు సమాధానం యిచ్చేడు.

"నేను పుట్టింది యీ ప్రపంచంలో. ప్రపంచం నాకోసం వుంది. ప్రపంచాన్నంతనీ దిగ్భ్రమ చెందిస్తా. అమ్మా!

నీ మూలాన్నే యింత వరకూ ఆ పట్టణాన్ని నిర్మూలించలేదు. నేను ముందుకు పోకుండా, కాలిలో ముల్లులా బాధిస్తూంది, నువ్వక్కడ వుండడం. ఇప్పుడు ఆ ఆటంకం తీరింది. రేపే ఆ దుర్మార్గుల్ని, మూర్ఖుల్ని నాశనం చేసేస్తాను."

"అబ్బాయీ! ఆపట్టణంలోని ప్రతీప్రాణీ, ప్రతీరాయీ నిన్ను చిన్నతనాన్నుంచీ యెరుగును!"

"రాళ్ళకి నోరులేదు. మనుష్యులే వాటిచే మాట్లాడించాలి. నన్ను గురించి పర్వతాలు కూడా ఘోషిస్తాయి కదూ? సరే, కానీ అమ్మా! అదే నాకు కావలసింది."

"ఐతే మానవుల మాటేమిటి, నాయనా?"

"వాళ్ళ సంగతీ మరిచిపోలేదమ్మా! వాళ్ళూ చెప్పుకోవాలి. మానవుల హృదయాల్లో వీరులకే శాశ్వతస్థానం వుంటుందని తెలుసు."

"అది సరే. కాని వీరుడెవడు? మృత్యువును యెదిరించి, జయించి, ప్రజారక్షణ చేసినవాణ్ణే వీరుడంటారు."

"పట్టణాలు కట్టి, నిలిపినవాడిలాగే, నిర్మూలించినవాడు కూడా వీరుడే. రోమునగరాన్ని నిర్మించిన దెవరో, రోమ్యులస్ యెవరో మనం యెరుగం. కాని దాన్ని నాశం చేసిన, 'అలరిక్' మొదలైన వాళ్ళని అందరూ యెరుగుదురు."

"వాళ్ళ పేర్లేమోగాని పట్టణం పేరు మాత్రం శాశ్వతంగా నిలిచిపోయింది." ఆమె మళ్ళీ అతన్ని దారిలో పెట్టడానికి ప్రయత్నించింది.

ఆ రోజు సాయంకాలం వరకూ తల్లీ కొడుకు లిద్దరూ యీవిధంగా చర్చించుకుంటూనే వున్నారు. పోనుపోను కుమారుని పరిగల్భవాక్యాలకీ, దారీ తెన్నూలేని వాదనలకీ ప్రత్యుత్తరం చెప్పడమే మానుకొంది, ఆమె. కుమారుని జూచి పొందిన ఆమె గర్వం విరిగిపోయింది; గర్వంతోబాటు ఆమె మనస్సుకూడా విరిగింది.

అమ్మ! అమ్మంటే జన్మదాత. ఆమెయే రక్షణకర్త. విధ్వంసాన్నీ, వినాశాన్నీ గూర్చి ఆమె ముందు చెప్పడం, హర్షించడం ఆమెను ధిక్కరించడమే! కాని గర్వాంధుడైన కుమారున కది తెలియదు. తల్లి జీవితసూత్రాన్నే యెదిరిస్తూన్నానని కానలేక పోయేడు, ఆ కుసంస్కారి!

అమ్మకూ, మృత్యువుకూ యెప్పుడూ చుక్కెదురే. అమ్మ జీవనప్రదాత; మృత్యువును ఆహ్వానించి తెచ్చేవాణ్ణి అమ్మ అసహ్యించుకుంటుంది. అమ్మ హృదయాన్ని ఆ మదాంధుడు కానలేడు. ఆతని హృదయం కీర్తికాంక్షతో నిండి పోయింది; కళ్ళు అధికారగర్వంతో మూసుకు పోయినాయి; జ్ఞానం ప్రతీకారవాంఛతో చచ్చిపోయింది!

సంతానం ప్రమాదంలో వున్నపుడు తల్లి నిర్భయంగా, నిర్దాక్షిణ్యంగా, మహాయుక్తిగా యెదిరిస్తుంది. ఆ సమయాల్లో ఆమె సాహసానికి మితిలేదు. ఆ సంగతి వాడికేం తెలుసు, పాపం!

ఆమె తల వాల్చుకుని కూర్చుంది. అక్కడినుంచిచూస్తే గుడారపు ద్వారంలోనుంచి దూరాన పట్టణం కనబడుతూంది.

ఆ గోడలలోపలే, ఆ నగరంలోనే తాను పత్నియై ప్రేమ డోలికల నోలలాడింది; అక్కడే గర్భధారణానందం అనుభవించింది; అక్కడే ప్రసవవేదనకు గిలగిలలాడింది; అక్కడే మాతృదేవతయై మసలింది. అటువంటి జన్మభూమినే, తన కన్నకొడుకు మట్టిపాలు చేస్తానంటున్నాడు! దుర్విధి!

ప్రొద్దువాలింది. అస్తంగత సూర్యుని అరుణకిరణాల్లో స్నానం చేసిన శిథిలనగరకుడ్యాలు ఎర్రిగావున్నాయి. ఎండకి నగరసౌధాల కిటికీఅద్దాలు ఎర్రగా రక్తం చిమ్ముతూన్నట్లున్నాయి. నగరదేవతకి ఒంటినిండా గాయాలుతగిలి, వాటినుండి రక్తం ప్రవహిస్తూన్న ట్లగుపిస్తూంది. క్రమంగా చీకటి పడింది. కొద్దిసేపట్లోనే నగరం నల్లని ముసుగులోని శవం మాదిరిగా ఐపోయింది. శవగృహంలో పెట్టిన దీపికలాగా మీాద నక్షత్రం ఒకటి మినుకు మినుకు మంటూంది.

శత్రువులకి జాడ తెలియనీకుండుటకై దీపం వెలిగించని యిండ్లు, చీకట్లో ములిగిన వీధులు, శవాలు క్రుళ్లిన కంపు, మరణోన్ముఖుల దగ్గరనున్న బంధువుల గుసగుసలు, — ఆమె కళ్ళముందు గిరగిరా తిరిగిపోతూన్నాయి. ఆమె మనస్సును కలచివేసి, ఆమె నిర్ణయం ఏమని ప్రశ్నించేయి.

పట్టణ ప్రజలందరూ తన కత్యంత ఆప్తులు. వారికోసం ఆమె హృదయం తల్లడిల్లి పోతూంది.

నల్లని పర్వత శిఖరాలనుంచి దిగజారుతూన్న మేఘ మాలికలు నిరాధారంగా నిలబడివున్న నగరంమీాదికి దాడి చేస్తూన్న గురిపుసైన్యాల మాదిరిగా కనబడుతూన్నాయి.

"చీకటి దట్టంగా వుందంటే యీరాత్రే పట్టణాన్ని పట్టే స్తాము. పగలు సూర్యకిరణాలు కళ్ళల్లో పొడుస్తూంటే, కత్తుల, డాళ్ళ మిలమిలలు మిరుమిట్లు గొల్పుతూంటే కొట్టే దెబ్బకూడా తప్పిపోతుంది. శత్రువును అప్పుడు దెబ్బతీయడం సులువుగాదు."

అనుకుంటూ అతడు కత్తిని ఒరదీసి, పరీక్షించేడు, ఒక్కక్షణం.

"నాయనా! ఇల్లా రారా. నా వొళ్ళో తలపెట్టుకుని ఒక్కనిముషం పడుకోకూడూ? చిన్నప్పు డెంత జాలిగుండేరా, నీది! నిన్నంతా ముద్దాడేవారేరా!..." అని తల్లి ఆతని తల మీాదినుంచి చేతిని పోనిచ్చి, వీపు నిమిరింది, వాత్సల్యంతో.

తల్లి చెప్పినట్లే ఆత డామె ఒళ్లో తలపెట్టి పడుకుని కళ్ళు మూసుకున్నాడు.

"అమ్మా! నిన్నూ, కీర్తినీ మాత్రమే ప్రేమిస్తున్నాను." అన్నాడు, కళ్ళుమూసుకొనే.

"నాయనా! నువ్వే స్త్రీనీ ప్రేమించలేదా?"

"ఎవరిని ప్రేమించినా అనుభవం వల్ల మోజు తగ్గి, మొహం మొత్తుతుంది. తీపి తినగా తినగా చేదుగా వున్నట్లే నమ్మా!"

"నీకు బిడ్డలు కావాలని వుండదా, నాయనా!" అందా తల్లి ఆఖరు యత్నంగా.

"బిడ్డలెందుకు? చావడానికా? ఎవడో నా బోటివాడే వచ్చి అందరినీ చంపుతాడు. అప్పుడు బాధకలిగినా కసి తీర్చుకునే ఓపికకూడా లేకండా వృద్ధుడనైపోతా. చెయ్యాడదు."

ఆమె ఒక్క నిట్టూర్పు విడిచింది.

"నువ్వు మెరుపులా అందంగా వున్నా దానిలాగే గొడ్డు వాడివిరా!"

"ఔనమ్మా! నేను మెరుపునే!" అని ఆతడు చిరునవ్వు నవ్వేడు. ఆమె యింకేమీ మాటాడలేదు.

కొద్దిసేపట్లోనే ఆతడు చిన్నబిడ్డలా తల్లి ఒడిలో తల బెట్టుకుని, సుఖనిద్రలో మునిగేడు.

తల్లి తాను కప్పుకొని వచ్చిన నల్లని ఉత్తరీయం తీసి అతని మీద కప్పింది. మెల్లగా మొలనుంచి కైజారుతీసి, అతని హృదయంలో దృఢంగా ఒక్కటే పోటు పొడిచింది. సన్నని మూలుగుతో, అంతటి మహావీరుడూ ప్రాణాలు వదలేడు. కొడుకు హృదయం తల్లికి తెలిసినట్లు మరెవరికి తెలుస్తుంది?

ఆమె కుమారుని శవాన్ని యీడ్చి తెచ్చి గుడారం బైట పడేసింది. కాపలావున్న సైనికులు యీ దృశ్యం చూసి నిశ్చేష్టులై నిలబడిపోయేరు. ఒక్కసారి పట్టణం వైపూ, తన కొడుకు శరీరం వైపూ చూసింది. అతడు తన జన్మభూమికి

యింకే అపాయమూ లేలేదు! ఆమెలో మాతృత్వం పొంగి పొరలింది. ఏడుపు కట్టలు తెగి ప్రవహించింది.

"నా జన్మభూమికి నే చేయగలదంతా చేసేను. జన్మ భూమికై మరో కొడుకును యివ్వగల కాలం తీరిపోయింది. నా జీవితం యింక నిరుపయోగం. నా కొడుకు దగ్గరికే పోయి వుంటానింక."

అంటూ ఆక్రోశించిందా తల్లి. ఆమె కళ్లు పొడారి పోయేయి. తన్ను తానే సంబాళించుకుని, లేచి నిలుచుని, కొడుకురక్తంతో యింకా నులివెచ్చగా వున్న కైజారుతోనే పొడుచుకొని నేలగూలింది. వ్యథితహృదయాన్ని తెలుసు కోవడం ఏమంత కష్టం?

తల్లి ప్రేమ జయించింది; మృత్యువుకు తల్లులుండే లోకంలో స్థానంలేదు!



# బాలుని డైరీ

వాళ్ళ కుర్రాణ్ణి ముద్దుగా 'మిషా' అని పిలుస్తారు లేండి. వాడు మహాచురుకైనవాడు. పట్టుమని పది నిముషాలైనా ఓ చోట కూర్చోడుగదా? ఏ వర్షం మూలానో ఆడుకునేందుకు వీధులోకి వెళ్ళనివ్వని రోజున యిల్లంతా గందరగోళమే. ప్రతీ పనికీ వాడే అడ్డు.

పెద్దవాళ్ళు ఏవో పనులతో ఊపిరి సలపకుండా కొట్టుకుంటూంటారు. అందుకనే పిల్లల్ని అస్తమానం 'అబ్బా! వేపుకు తినకురా!' అని గదుముతూంటారు.

మిషాకూడా తల్లిదండ్రుల నోట యీ గద్దింపుమాట యెన్నోసార్లు విన్నాడు. వాళ్ళకి ఎప్పుడూ పనే. మిషాతో ఆడుకోడానికి గాని, వాడి ప్రశ్నలకి సమాధానం చెప్పడానికి గాని వాళ్ళకి తీరి కెక్కడిది? వాళ్ళనాన్న పుస్తకాలగదిలోనే యెప్పుడూ పాతుకుపోతాడు. ఏదో పుస్తకం చదవడమో, రాయడమో,—యిదే పని. మరి, ఆ పుస్తకాలు బాగుంటాయో, లేదో! మిషాని యెప్పుడూ చదువనీయనే లేదు, వాటిని.

అమ్మా చాల మంచిదే. చిన్న బొమ్మలా వుంటుంది, ఎంచక్కా. నాన్నా మంచివాడే. పెద్ద చెట్టంత మనిషి.

వేసవికి ముందు ఓరోజున చినుకూ, గాలీ జోరుగావుంది. మిషా ఆడుకునేందుకు వీధులోకి వెళ్ళడానికి వీలైందికాదు.

ఇంట్లోనే వుండి ఏం తోచక అల్లరి ప్రారంభించేడు. వాడి గోడ వను తల్లీ తండ్రీ కూడా భరించలేక పోయేరు. వాళ్ళ నాన్న మిషాను దగ్గరికి రమ్మని పిలిచేడు.

"ఏమీ తోచడం లేదా యేమిట్రా అబ్బాయి!''

''రాని లెఖ్ఖ చెయ్యడానికి కూర్చున్నట్లుంది, నాన్న గారూ!''

అన్నాడు, మిషా గునుస్తూ.

వాళ్ళనాన్న రూళ్ళకాగితాలున్న ఓ చిన్న బైండు బుక్కు తీసి చూపిస్తూ,—

''మిషా! చూసేవా! ఇదిగో, యీ తెల్లకాగితాల పుస్తకం వుందే దీంట్లో నీకు సరదాగా తోచిన సంగతులన్నీ రాసుకుంటూండు. ఏఁ! తెలిసిందా! దీన్నే 'డైరీ' అంటారు. రోజూ రాసుకునేదే డైరీ. రాసుకుంటావు గదూ?"

మిషా ఒక్కక్షణం ఆలోచిస్తూ నిల్చున్నాడు.

''సరదాగా తోచీ సంగతులంటే?"

"నాకెల్లా తెలుస్తుందిరా, నీకు సరదాగా వుండే సంగతులేమిటో!" అంటూ వాళ్ళనాన్న సిగరెట్టు తీసి వెలిగించేడు.

''మీకెందుకు తెలియదేమిటి?''

"తెలియదురా. చిన్నప్పుడు నేను చదువుకోలేదు. ఏవో పిచ్చిపిచ్చి ప్రశ్నలువేసి అందర్నీ విసిగించే వాణ్ణి. ఎప్పుడూ దేన్నిగురించీ ఆలోచించనే లేదు. నాకా అవకాశం లేకనే

పోయింది. అంచేతనే చిన్నపిల్లలకి ఏవి సరదాగా వుంటాయో నాకు ఏమీ తెలియదు. సరే ఇంక వెళ్ళు, మరి.''

తండ్రి తన్ను యెగతాళి చేస్తూన్నాడనీ, తనతో మాట్లాడడానికి యిష్టపడడం లేదనీ మిషా గ్రహించేడు. కోపం రాబోయింది. కాని తండ్రి కళ్ళల్లో ప్రేమ, అభిమానంతోలు కాడుతూ వుండడం చూసి, కోపం వెనక్కి పోయింది. అంచేత మళ్ళీ యింకో ప్రశ్న వేసేడు.

"సరదాగా వుండే పనులు ఎవరు చేస్తూంటారు, నాన్నా!"

"నువ్వే! బాబువి కాదూ? ఇంక వెళ్ళు. నన్ను పని చేసుకోనియ్యి."

మిషా తన గదిలోకి వెళ్ళి, టేబుల్ ముందు కూర్చుని పుస్తకం తెరిచి, వ్రాత మొదలు పెట్టేడు.

"ఇది డైరీ."

"దీనిని నాన్న యిచ్చేరు. నాకు తోసినవన్నీ దీన్లో లాసుకుంటాను. ఎంచక్కా సరదాగా వుంటుంది."

కలం టేబిల్ మీద పెట్టేసి, గదంతా కలయచూసేడు. అందులో అన్నీ తనకు రోజూ కనబడేవే. కొత్తవేమీ లేవు. పాతబడిన వాటిలో సరదా తోచడానికి ఏముంది?

పుస్తకం తీసుకుని మళ్ళీ వాళ్ళ నాన్నదగ్గిరికి బైలుదేరేడు. మిషా మళ్ళీ రావడంతో ఆయనకి చిరాకు కలిగింది.

"మళ్ళీ వచ్చేవా?"

మిషా నోటుబుక్కు చూపుతూ,—

"చూడండీ, నాన్నారూ! అప్పుడే రాసేసేను. బావుందా?" అన్నాడు.

"భేషుగ్గా వుందోయ్! 'డెరీ' కాదు. 'డైరీ' అని వుండాలి. 'తోసినవన్నీ లాసుకుంటా' అనకూడదు. 'తోచిన వన్నీ రాసుకుంటా' ననాలి. తెలిసిందా? యింక వెళ్ళు, మరి."

మిషా ఒక్క నిముషం ఆలోచించేడు.

"ఇంకేం రాయను ?"

"నీకు తోచింది రాసుకో. దేన్ని గురించైనా ఆలోచించి మరీ రాయి. పాటలు రాయి, బాగుంటుంది!"

"పాటలా? ఏం పాటలు ?"

"నీకు వొచ్చినవి రాయడం కాదురా. నీఅంతట నువ్వు కొత్తవి అల్లి, రాయాలి. వెళ్ళుమరి. పరిగెత్తు. ఏం దెబ్బలు తింటావురా!"

అంటూ మిషా చెయ్యి పట్టుకుని గదివెలుపల దిగబెట్టి, తలుపులు లోన గడియ వేసుకున్నాడు, వాళ్ళ నాన్న. ఇట్లా చేయడం తన కెంతో అగౌరవకరంగా భావించేడు, మిషా. అభిమానంతో తిన్నగా తనగదిలోకి వెళ్ళి బల్లవద్ద కూర్చుని, డైరీ తెరిచేడు. ఏం రాయాలో ఏమీ తోచడం లేదు, వాడికి. అమ్మ వంటింట్లో గిన్నెలు, చెంచాలు లెక్కచూసుకుంటూంది. వంటింట్లో వెచ్చగా యెంతో బాగుంటుంది. కాని అక్కడికి తనను రానివ్వరు కదా! వీధులోకి పోకుండా దిక్కుమాలిన బురద ఒక టొచ్చిందాయెను.....

మిషా యేం తోచక గడియారం వంక చూసేడు. ఇంకా తొమ్మిదిం పావు కూడా కాలేదు. అంతలో ఒక ఆలోచన తట్టింది. చిరునవ్వుతో గబుక్కున డైరీ తెరిచి రాయడం ప్రారంభించేడు.

"మా గోడమీద గడారం వొకటుంది,

మీసాల్లా తన ముళ్ళని కదిలిస్తుంది"

అరే! పాటయి పోయిందే! వహ్వా! మిషా బల్లమీది నుంచి వురికి వంటింట్లోకి పరుగెత్తేడు.

"అమ్మా! అమ్మా! పాట రాసేనే, చూడవే!"

లెక్కపెడుతూన్న చెంచాలనుంచి ఆమె తలత్రిప్పనైనా లేదు!

"తొమ్మిది...నన్ను వేపుకు తినకురా, నాయనా!... పది...వెళ్ళు మరి...పదకొండు..."

మిషా అంతతో వదిలే రకం గాదు. ఆమె మెడకు ఓ చెయ్యి చుట్టబెట్టి, రెండో చేత్తో డైరీని తల్లి కళ్ళముందర అడ్డంగా పెట్టేడు.

"అమ్మా! ఒక్కమాటు చూడవే!"

"నన్ను పడేస్తావురా నాయనా!" అంటూనే ఆమె పుస్తకం తీసికొని చదివింది.

"మీ నాన్న రాసి పెట్టేరా?" అన్న తల్లిమాటలకి మిషా ఎంతో అభిమాన పడ్డాడు. అది గమనించకుండానే,—

"'గడారం' కాదు. 'గడియారం' అని వుండాలిరా."

మిషాకి యెంతో చిన్నతనం అనిపించింది.

"పాటల్లో కూడానా ?"

"ఆఁ ! ఇంక వెళ్ళు. బాబువుకాదు ! ఇంక వెళ్ళమ్మా ! ఆడుకో."

"......"

"వెళ్ళి యింకా పాటలు రాయి."

"ఏం రాయను ?"

"గడియారం టిక్కు టిక్కు మంటూందనో, మరోటో యేదో రాయి ! పాట పూర్తవుతుంది."

"ఓఁ ! అల్లాగే !"

చెంగున ఒక్క దూకులో మిషా తనగదిలోకి వెళ్ళిపోయేడు. టేబిల్ ఎదట కూర్చుని తల్లి సలహా ప్రకారం పాట రాసేడు.

"గడియారం టికుటికుటికు మంటూంది."

తరువాత యెంత తంటాలుపడ్డా యేం వ్రాయాలో తోచలేదు. చేతుల నిండానూ, గడ్డం నిండానూ యింత సిరా మాత్రం పులుముకున్నాడు.

హఠాత్తుగా యెవరో చెప్పి, చేయి పట్టుకు రాయించినట్లుగా నాలుగో చరణం కూడా రాసేసేడు.

"ఏమోగాని నాకేమీ తోచకుండా వుంది !"

నిజమే! మిషాకేమీ తోచడంలేదు. ఆ మాటనే కాగితంమీద రాసేసరికి పాట పూర్తైపోయింది! పట్టరాని సంతోషంతో మిషా గంతులు వేసేడు.

ఒక్క పరుగున వాళ్ల నాన్న గది దగ్గరికి పోయేడు. కాని, ఆయన చాల గడుసువాడేమో, తలుపు లోన గడియ వేసుకునే వున్నాడు. మిషా ఊరుకోక, తలుపు కొట్టేడు.

"ఎవరు ?"

"నాన్నా ! తలుపు తియ్యండి ! త్వరగా !" అన్నాడు మిషా ఒగరుస్తూ.

"తలుపు తియ్యండీ ! నేనే ! నాన్నా ! చూసేరా ఎంత మంచిపాట రాసేనో !"

వాళ్లనాన్న తలుపు తీయకుండా లోపలినుంచే "భేష్ ! యింకా రాయి." అన్నాడు.

"మీరు వినరూ మరి !"

"తర్వాత వింటాలేరా, వెడుదూ !"

"అహఁ ! ఇప్పుడే వినాలి !"

"మిషా ! చెప్తే వినవూ !" అన్నాడు వాళ్ల నాన్న గద్దింపుగా.

తాళపు రంధ్రముదగ్గర నోరుపెట్టి పాట చదివేసేడు, మిషా. స్వరం పైకిరాక నూతులో మాట్లాడినట్లు వినబడింది. తండ్రి యేమీ మాటాడలేదు.

మిషాకి యెంతో అభిమానం అనిపించింది. తనగదిలోకి వెళ్ళిపోయి, కిటికీ అద్దాలకి తల ఆనించి ఆలోచిస్తూన్నట్లు చాలాసేపు నిలువబడ్డాడు. కొంచెం సేపయేక టేబిల్ దగ్గరికి తిరిగివచ్చి, తన మనస్సులో మెదులుతూన్న భావాల్ని డైరీలో రాయనారంభించేడు.

"నాన్న మంచివాడు కాదు. డైరీ రాస్తే సరదాగా వుంటుందన్నారు. అంతా వుత్తిది. ఆ మాట నన్నొదుల్చు కొనేందుకు చెప్పేరు. నాకు తెలుసు. అమ్మ కోపంగా వున్నప్పుడు ఆమెని 'పోట్లగొడ్డు' అంటారు. కాని తమరుమాత్రిం? నిన్న సిగరెట్టుపెట్టితో ఆడుకుంటూంటే నన్ను అమ్మకంటె యెక్కువగా కోపబడ్డారు. నాకు ఆయనగారేం చెప్పఖ్ఖర్లేదు. ఇద్దరూ ఒకటే కోపానికి. సీనా యేదన్నా పగలగొడి తే 'ఫరవాలేదులే!' 'పోనీలే!' అంటారు. ఆవిడ పాటలు పాడుతుందిగా, అందుకని! నేనేదన్నా పగలగొడితేమాత్రం రోజులకొద్దీ సాధిస్తూంటారు."

తల్లిదండ్రులు తనకు అన్యాయం చేస్తూన్నారనే ఆలోచన తట్టేసరికి మిషాకు కళ్ళనీళ్లు తిరిగేయి. వాళ్లెంత మంచి వాళ్ళయితేనేమి? తన్ను సరిగ్గా చూడ్డంలేదు.

రాత కట్టిపెట్టి మిషా కిటికీదగ్గరకు వెళ్లేడు. కిటికీలో అంచున కూర్చుని ఓ పిచిక తడిరెక్కలు దులుపుకుని, దువ్వుకుంటూంది, కాళ్ళతో. ఆ పిచికనుచూస్తూ నిలబడ్డాడు, మిషా. దాని తడిరెక్కలు నాన్నమీసాల్లా వున్నాయనిపించిందేమో, అక్కడే నిలబడి తనలోనే పాట అల్లడం ఆరంభించేడు.

"పుల్లల్లా కాళ్ళున్నాయిదీ
తేనెకళ్ళ పిచికపిట్టకి
నాన్న మీసాల్లాంటి రెక్కలు
ఉన్నాయోయ్! చూడండోయ్!"

అతని ఊహాలు లయలో నడవడంలేదు. కాని, ఆమాత్రం చాలు, యిప్పటి మటుక్కి. మిషా హృదయం గర్వంతో నిండింది. వెంటనే టేబిల్ దగ్గరకి పరుగెత్తి, కొత్తపాట డైరీలో రాసేసేడు. తర్వాత మళ్ళీ తన ఆలోచనలు రాయ నారంభించేడు.

"పాటలు రాయడం చాలా సులువు. చేయవలసినదల్లా యేదో ఒకదానివైపు చూడ్డమే. మాటలు వాటంతటవే దొర్లుకుంటూ వస్తాయి. నాన్నగారు యేమీ బడాయిలు పోనక్కర్లేదు. కావాలంటే నేనూ పుస్తకాలు రాయగలను. పాటలుకూడా రాస్తాను. తప్పులు లేకండా రాయడం, చుక్కలు పెట్టడం నేర్చుకుంటా. అమ్మ, కొమ్మ, వెన్న, కన్న,— యిలాటి జంటమాటలు ఆఖరున వచ్చేలాగ కూడా పాట రాసేస్తాను. కాని, యిప్పుడు రాయను. పద్యాలూ రాయను. డైరీకూడా రాయడం మానేస్తా. ఆయనకే సరదా లేకపోతే నాకా యేమిటి? నన్ను వేపుకుతినద్దు. ఏం చేసినా రాయను."

మిషాకు యేడుపు వచ్చేటంత పర్యంతం అయింది. ఇంత లోనే దాది జెనియా ఆ గదిలోకి వచ్చింది. జెనియా పొట్టిగా, చిన్నదిగా వుంటుంది; బూరె బుగ్గలు. ఆమె కనుబొమలమీద నిలచిన వాన చినుకులు మెరుస్తున్నాయి.

"మూతి ముడుచుకుని అట్లా వున్నావేం?"

ఆమె రావడం వల్ల తన ఆలోచనలన్నీ చెదరిపోయినట్లు కనుబొమలు కుంచించేడు, మిషా. తండ్రి వైఖరి ననుకరిస్తూ,–

"నన్ను కదిలించకు, జెనియా!"

అని మళ్ళీ రాయడం మొదలెట్టేడు.

"దాదిని నాన్నగారు 'బుర్రముక్కు' అంటారు. పిల్లల్ని ఆడించే వయస్సులో గాక పిల్లలతో ఆడుకొనే వయసులో వుందంటారు."

మిషాధోరణి దాదికి ఆశ్చర్యం కలగజేసింది. మెత్తని చేతులతో బుగ్గలు రుద్దుకుంటూ అడిగింది.

"ఏమిటి రాస్తున్నావు? ఏం కథ?"

"చెప్పకూడదు. నాన్నగారు డైరీ రాయమన్నారు. నాకు సరదాగా తోచినవన్నీ రాసుకోవచ్చునన్నారు."

"ఇప్పుడు నీకంత సరదా కలిగించిన సంగతేమిటోయ్, మిషా?"

అంటూ జెనియా పుస్తకంమీదికి వొంగి చూసింది. పుట తిప్పుతూ,

"ఇంకా యేమీ రాయలేదులే. ఏవో పాటలు రాసేనంతే." అన్నాడు, మిషా.

"చూడు యెన్ని తప్పులో. ఓహో! నిజంగా పాటలే! నువ్వు రాసినవి కాదు. నే నెరుగుదునులే! నాన్న రాసి పెట్టేరు. కాదా?"

మిషాకు ఎంతో అభిమానం వేసింది. ఏమిటిది? ఎవరూ నమ్మరే? కోపంకూడా వచ్చేసింది.

"ఐతే, ఈవేళ పాఠం చదవను."

"ఏం? ఎంచేత?"

"ఏమేమిటి? చదవను. అంతే!"

అప్పటికి జెనియా తన్నుగురించి రాసిన భాగం దగ్గరికి వచ్చింది. ఆ రాతచూడ్డంతోనే ఆమె మొగం జేవురించింది. ఎదుట అద్దంలో కనిపిస్తూన్న తన ముఖంవైపొకసారి ఆమె దృష్టి పోయింది.

''నన్ను గురించి కూడా రాసేవూ? నిజంగా నాన్న అల్లా అన్నారా?''

''ఏం! నువ్వంటే ఆయనకి భయమా!''

దాది ఆలోచనలో పడింది. మళ్ళీ తనముఖం యింకో మారు అద్దంలో చూసుకుంటూ,—

''ఐతే పాఠం చదవ్వన్నమాట?''

''ఉఁహుఁ!''

''అమ్మతో చెప్తానుండు.'' అంటూ జెనియా విసవిసా వెళ్ళిపోయింది.

ఆమె గుమ్మం దాటి పోయేదాకా చూసి, మిషా మళ్ళీ రాయడం ఆరంభించేడు.

"నాన్నమీద అమ్మ కస్సుమన్నట్లే జెనియా మీద నేనూ కస్సుమన్నాను. నన్ను విసికించి వేపుకుతింటే ఏం

చేస్తాను? నామీద అందరికీ కోపం వచ్చినా నాకేం లెఖ్ఖలేదు. ఆనక వెళ్ళి జెనియాను మన్నించమని అడుగుతాను, పోనీ. పుస్తకంలో అదీ రాయాలి. నాన్నగారిలాగే రోజంతా రాస్తూంటాను. ఎవ్వరూ నన్ను చూడనక్కర్లేదు. నేను అన్నం తినను. కాల్చిన ఆపిలు యిస్తానన్నా నాకు అఖ్ఖర్లేదు. రాత్రిళ్లు నిద్రపోను. తెగరాసేస్తాను, కూర్చుని. 'జబ్బుచేస్తుంది. ఒకవేళ పనా?' అని నాన్నగారిని అన్నట్లే అమ్మ నన్నూ అంటుంది. అన్నా సరే! ఏడ్చినాసరే! నేను విననుగాక వినను. నామీద యెవరికీ యిష్టం లేకపోతే నాకేం భయంలేదు."

ఆతడీమాటలు రాసి ముగించే సరికి తల్లిని పిలుచు కొచ్చింది, జెనియా. తల్లి యే మాటా మంతీ లేకండానే మిషా చేతులోని పుస్తకం తీసుకుని చదవడం ప్రారంభించింది.

కొంత చదివి, ఆశ్చర్యంగా మిషా ముఖంవైపు చూస్తూ,—

"ఓరి పిడుగా! నువ్వే రాసేవా యిది? మీ నాన్న చూస్తారుండు!"

అని, పుస్తకం పుచ్చుకుని వెళ్ళిపోయింది.

"నాన్నగారు కొడతారు" అనుకుంటూ మిషా జెనియా వైపు తిరిగి,—

"నామీద అమ్మతో చాడీలు చెప్పేవా?" అనడిగేడు.

"చెప్పినట్టు వినకపోతే..."

"చెప్పి నట్లల్లా వినడానికి నేనేం గుర్రాన్నా?....."

"మిషా !......"

కాని మిషా మహాకోపంగా వున్నాడు.

"ఓ వైపు ఆలోచించాలి, పుస్తకంలో రాయాలి; రెండో వైపు పాఠాలు చదవాలి. నాచేతగాదు."

మిషా యింకా యేమనేవాడో కాని పనిమనిషి వచ్చి 'నాన్నగారు పిలుస్తూన్నా' రంది.

ఓ చేత్తో పుస్తకం పట్టుకుని, రెండో చేత్తో మీసం దువ్వుకుంటూ కుర్చీలో కూర్చుని వున్నాడు, వాళ్ళనాన్న.

"ఇల్లా రావోయి !"

నాన్న కళ్ళు నవ్వుతూన్నాయి. మంచం మీద బోర్లా పడుకుని, దిండులో ముఖం దాచుకుని వుంది, అమ్మ. ఆమె భుజాల కదలిక చూస్తే కడుపుబ్బేలా నవ్వుతూందని తెలుస్తూనే వుంది. పరిస్థితంతా ఒక్క నిమిషంలో గ్రహించేసేడు, మిషా.

"నాన్న కొట్టరు." మిషా నిమిషంలో గ్రహించేడు.

వాళ్ళనాన్న మిషాను దగ్గరికి తీసుకుని మోకాళ్ళ మధ్య నొక్కి పట్టుకుని, చుబుకం పుణుకుతూ,—

"మహా అల్లరివాడవై పోతూన్నావురా? ఏం?"

"ఔను." మిషా తనూ అంగీకరించేడు.

"ఏం? ఎందుచేత?"

"ఏమో ! ఊరికేనే."

"ఊరికేనే యేమిటి? కారణం చెప్పలేవూ?"

"నాకు తెలియదు."

మిషా కొంచెం సేపు ఆలోచించేడు.

"మీరు నాగురించి యేమీ పట్టించుకోరు. అమ్మ అంత కంటేనూ! జెనియా, చదువూ! చదువూ! అని వేపుకు తింటుం డామెను."

"అందుకని నీకు కోపం వచ్చిందా?" నాన్న బహు తాపీగా అడిగేడు.

"ఔను, మరి రాదూ?"

"అల్లా దేనికీ కోపం తెచ్చుకోకూడదు. నిన్ను చిన్న పుచ్చాలని నేను యెప్పుడూ అనుకోనోయ్. మీ అమ్మా అంతే. చూడూ, అమ్మ యెల్లా నవ్వుతూందో. నాకూ నవ్వు వస్తూంది."

"నవ్వెందుకు వస్తూంది?"

"చెప్తాలే, వుండు మరి."

"అహాఁ! ఇప్పుడే చెప్పాలి." ముద్దుగా గునుస్తూ అన్నాడు మిషా.

"నువ్వు వట్టి కొంటె కోణంగివి."

"నేనా?"

మిషాను యెత్తి వొళ్ళో కూర్చోబెట్టుకుని, తల నిము రుతూ వాళ్ళనాన్న అడిగేడు.

"చెప్పనా?"

"ఊఁ!"

"నిన్ను యెవరూ యేమీ అనలేదు. చూసేవూ, యీ గాలీ, చినుకూ. వీటిమూలాన చీదరగావుంది. నీ మనస్సు అల్లా వుందంతే. కాస్త యెండ గాచి, బైట ఆడుకొనేందుకు వీలుగావుండనీ మళ్ళీ, నీ చిర్రాకు నిముషంలో మాయమై పోతుంది. అది పోనీ గాని, నీ డైరీనిండా యెంతో చెత్త రాసేవు."

"మీరే రాయమన్నారుగా!" మిషా భుజాలు కుంచించు కున్నాడు.

"రాయమన్నాను గాని చెత్త రాయమన్నానా?"

"లేదు. గాని ఏం రాసేనో నాకూ జ్ఞాపకంలేదు. నే రాసిందంతా నిజంగా చెత్తే?"

"ఔను!" తలపంకిస్తూ అన్నాడు వాళ్లనాన్న.

"మీరుకూడా చెత్త రాస్తూవుంటారా?" మిషా అమా యికంగానే అడిగేడు.

వాళ్ళమ్మ గభీమని లేచి వంటింట్లోకి పరుగెత్తింది, అక్కడేదో పొయిమీదపెట్టి మరిచిపోయినట్టు. ఆమె వైఖరీ, చేసిన సవ్వడినీ బట్టి ఉక్కిరిబిక్కిరిగావచ్చే నవ్వునాపుకుంటూం దని యెవరేనా గ్రహించవచ్చు.

పెద్దవాళ్ళు యిల్లా నటిస్తారేం!

వాళ్ళనాన్నకి కూడా నవ్వు వస్తూన్నట్లేవుంది. పెదవులు బిగించి, బుగ్గలు బూరటించి, మీసాలు దువ్వుకుంటూన్నట్టుగా

చేతులు ముఖాని కడ్డం బెట్టుకుని, ముక్కుతో చిత్రంగా ధ్వని చేస్తూన్నాడు !

"నేను రాసే దాంట్లో కూడా కొంత చెత్త వుంటూనే వుంటుంది. అన్నీ బాగా రాయడం కష్టం. నీ పాట బాగుంది. మిగిలింది బాగాలేదు."

"ఎంచేత ?"

"నువ్వు మా చెడ్డ ఆరాతీస్తున్నావు. అందర్నీ విమర్శించే ముందు నిన్ను నువ్వే విమర్శించుకో. ఇక నేమీ రాయకేం ? డైరీ మనకింక వద్దులే."

వాళ్ళనాన్న వాళ్ళో కూర్చునే రంగుపెన్సిలుతో ఆయన పుస్తకంలో బొమ్మలు వేస్తున్నాడు, మిషా.

"సరే. ఇంకేం రాయనులెండి. రాయడంకూడా పాఠం లాగే యేమీ బాగుండలేదు. మీరే రాయమన్నారు. అందు కని రాసే నంతే. నాకందులోసరదా యేం కనిపించలేదు. ఈవేళపాఠం వద్దు, ఏంవద్దు."

"ఎందుచేత ?"

"జెనియాచేత కథ చెప్పించుకుంటా."

"అల్లాగేలే."

వాళ్ళనాన్న సంతోషంగా అంగీకరించేడు.

"ఇదిగో ! చూడు ! మనం యిద్దరమూ జెనియాను మన్నించమని అడగాలి. ఆమెను గురించి నేనన్నదీ, నువ్వు రాసిందీ కూడా ఏమంత మంచిదిగాదు."

వాళ్ళనాన్న కుర్చీలోంచి లేచి, మిషాచెయ్యి పట్టుకుని పచారుచేస్తూ, నెమ్మదిగా బోధన ప్రారంభించేడు.

"జెనియా ముక్కు పెద్దదే అనుకో. కాని ఆమాట జ్ఞాపకం చేయడం మంచిదిగాదు. ఆ లోటు బ్రతికివున్నంతకాలం వుండేదేగాని, మాటలవల్లా దేనివల్లా పోయేదికాదు. నీముఖం మీాద మశూచికపు గంట్లున్నాయనుకో. నిన్ను 'గంట్లముఖం వాడా!' అని యెవరేనా పిలిస్తే ఒప్పుకుంటావా ?"

"ఉహుఁ !"

"ఇంకెప్పుడూ అట్లాటి విషయాలు డైరీలో రాయకేం."

మిషా డైరీ కథ యీా విధంగా ముగిసింది.



# ఛెల్కాష్

రేవులో రేగిన ధూళివల్ల వినీలంగావుండే దక్షిణాకాశం ధూసరవర్ణంగా కనిపిస్తోంది. నిప్పులు చెరుగుతూన్న మధ్యాహ్న సూర్యుడు దుమ్ము తెరలోంచి ఆకుపచ్చని సముద్రం లోకి చూస్తూన్నాడు. పడవల తెడ్లు, స్టీమర్ల పంకాలు, టర్కీ ఫెలుక్కాల చుక్కానిలు, రకరకాల పడవలు నిరంతరం అటూయిటూ తిరుగుతూ నీటిని కలిచేస్తూండడంవల్ల సూర్యుని ప్రతిబింబం కనిపించడమే లేదు. స్వేచ్ఛా సంచారానికి కలవాటు పడిన సముద్రపుటలలు నల్లరాతి గోడలనడుమ బంధించబడినా నిరంతరం పోరాటం చేస్తూన్నాయి. సరుకులతో నిండిన పడవలూ, ఓడలూ క్రిక్కిరిసిపోయి నీరు కానరాకుండా వుంది. బరువైన ఓడలు తమ శిఖరాలమీది కెక్కి తొక్కిసలాడి అణిచేస్తున్నా సముద్రపుటలలు ఉద్ధృతంగా హార్బరుగోడలకి కొట్టుకుంటూ నురుగులు గ్రక్కుతున్నాయి. తమ నిర్బంధాన్ని గూర్చి ఆందోళన చేస్తూ, నిరంతర పోరాటం చేస్తూన్నట్లుగా సముద్రపుటలల ఘోష వినిపిస్తూంది. ఓడల్లోంచి పడేసిన నానారకాల చెత్తాచెదారంతోనూ రేవులంతా మలినమైవుంది.

రేవుప్రాంతం అంతా ఒక్కటే రణగుణధ్వని. ఎక్కడ చూసినా లంగరు గొలుసుల గలగలలు; వార్ఫుమీదికి సరుకులను తెచ్చే రైల్వేవాగన్ లింకుల ధణాధణలు; చప్టారాళ్ళ మీద పడేస్తూన్న లోహపురేకుల ఝణఝణలు; దుంగలూ

దూలాలు మెత్తిపడేస్తూన్నప్పటి గుభిల్లు ధ్వనులు; కిరాయి బళ్ల కిరకిరలు; స్టీమర్ల యీలలు, అరుపులూ; డాక్ కూలీల అరపులు, కళాసీల కేకలు, ఉద్యోగుల గద్దింపులు,— యివన్నీ కలిసి, కరిగి ఒకటై హార్బరు ప్రాంతంలో స్వైరవిహారంచేస్తూ, పనిరద్దీ రోజును తెలుపుతూంది. ఈ ధ్వని తరంగాలుగా భూమి మీాదనుంచి మళ్ళీమళ్ళీ లేచి, పైన తేలియాడుతూన్న ధ్వని సముద్రంలో లీనమవుతోంది: చుట్టూ గాఢంగా, దిగులుగా నణుగుతూన్న ప్రతిధ్వనులు వణుకుతూ అణిగిపోతున్నాయి. దుమ్ముతో చిక్కగావున్న వేడిగాలి తెరను చీల్చుకుంటూ ఈలలు, స్టీమర్లకూతలు గూబలు బ్రద్దలుచేస్తూ, బెదిరిస్తూన్నట్లు వినిపిస్తున్నాయి.

కుబేరుని కంకితమైన హార్బరు పరిసరాల్లోని ప్రతి వస్తువూ,—చప్టారాళ్లు, లోహాలు, కొయ్య సామగ్రి, ఓడలు,— అన్నీకూడా షడ్జమస్థాయిలో ధనపతికి స్వాగతగీతాలు పాడుతూన్నాయి. అక్కడి గోలలో మానవుని గొంతే బలహీనంగానూ, హాస్యాస్పదంగానూ వుంది. ఈ గడబిడకంతకీ మూలమైన మానవులు మాత్రం జాలిగొలుపుతూ, ఆ వాతావరణంలో దయనీయులుగానూ, పిచ్చివాళ్ళుగానూ కనిపిస్తూన్నారు. అంతేగాదు. మానవుల చిన్న విగ్రహాలు దుమ్ముతో కొట్లాడుతూ, చింకిపీలికల్లో, భుజాలకెత్తుకున్న బరువులక్రింద కుంగి నడుస్తూ, వాళ్ళను అటునిటు తరిమే తొందరల్లోమునిగి, దుమ్ము, ఎండలో, గోలలో నామమాత్రులుగా; తామే

సృష్టించిన మహాయంత్రాలముందు, సామాను గుట్టలముందు, పిడుగులు పడుతూన్నట్లు పరుగెత్తే రైల్వేవాగన్లముందు క్షుద్ర కీటకాల్లా కానవస్తూన్నారు! ఒక్కమాటలో చెప్పాలంటే అతని సృష్టే అతన్ని బానిసగాజేసి ఆతని వ్యక్తిత్వా న్నపహరించింది!

రాక్షసి ఓడలు యీలలు వేస్తూ, కన్–బుస్‌లతో ఆవిరి వదులుతూ నిట్టూరుస్తూన్నట్లున్నాయి. ప్రతిధ్వనిలోనూ మానవునిపట్ల తమ అసహ్యాన్నీ, నిరసననూ వెళ్ళగక్కుతూన్నాయి, ఆ నిర్జీవయంత్రాలు. బానిస చాకిరీ చేస్తూ, సకలసంపదల నుత్పత్తిచేసి తమ పొట్టలు నిండించి, వారేమో మురికిగా, మాడిన డొక్కలతో, చెమటలు గారుస్తూ అటూయిటూ తచ్చాడుతూన్న జీవుల్ని చూస్తూంటే నిర్జీవ యంత్రాలకి కూడా అపహాస్యం కలిగితే ఆశ్చర్యమేమిటి! తమ జానెడు పొట్టల నింపుకోడానికై కొద్ది ఔన్సుల రొట్టెకోసం వీపులమీద వేలకొద్దీ టన్నుల ఆహారాన్ని మోసితెచ్చి వాగన్ల, ఓడల ఉక్కుకడుపుల్ని నింపే కూలీల పంక్తులు చూస్తే యెంతో అసంగతంగానూ, బాధాకరంగానూ వుంటాయి. చింకి గుడ్డలతో, చెమటలు కారుతూ, పనిబరువుకి క్రుంగిపోయి, వేడికీ, గోలకీ, దుమ్ముకీ స్థంభీభూతులై సగం చచ్చివున్న మానవులు ఒకవైపున; రెండోప్రక్క వారిచేతనే సృజించబడి, బ్రహ్మాండమైన శరీరాలతో, ధగధగ మెరుస్తూ, గంభీరంగా, మాంచి పోషకక్కులో వున్న యంత్రాలు! ఇంతకీ యీ యంత్రాలు

నడవాలంటే ఆవిరిబలం చాలనే చాలదు; వాటి సృష్టలైన మానవుల కండరబలం, రక్తం ధారపోయాల్సిందే! ఈ వైరుధ్యంలోనే క్రూరవిధియొక్క, మానవచరిత్ర యొక్క అపహాస్యం అంతా యిమిడివుంది!

అక్కడి గోలకి వుత్సాహశక్తి లడుగంటుతాయి; ధూళికి ముక్కులు, కళ్ళు పూడిపోతాయి; ఆ యెండకి శరీరాలుమాడి ఒరుగై పోతాయి. ఆ ప్రదేశంలోని భవనాలూ, మానవులూ, వార్ఫూ,—అన్నీ భరించరాని విసుగుతో బ్రద్దలు కావడానికి సిద్ధంగా వున్నట్లున్నాయి. ఒక్కసారిగా ప్రేలిపోవడంతో స్వేచ్ఛగా ఊపిరిదీసుకుంటూ ఉన్ముక్త వాతావరణంలో బ్రతుకగలుగుతామనుకుంటున్నాయా? అనిపిస్తుంది. ఆ ప్రేలుడు తర్వాతనే యీ భూమిమీద శాంతి వుండేది! చెవులు బ్రద్దలు చేస్తూ నరాల్ని నములుతూ మానవుల్ని నిరుత్సాహులుగా, పిచ్చివాళ్లనిగా చేసే యీ గోలా, దుమ్మూ అప్పుడు మాయమవుతాయి. అప్పుడే రేవుల్లో, భూమిమీద, సముద్రాకాశాలపైన,—ప్రతీచోటా ప్రశాంతత, ఆనందం, తృప్తీ, తాండవమాడుతాయి.

టైము తప్పని గంటలధ్వని శ్రావ్యంగా పంద్రెండుసార్లు వినిపించింది. ఆఖరి ఘంటానాదం యింకా రింగ్ మంటూండగానే అమానుషశ్రమయొక్క ఆటవికనృత్యం మందగించింది.

మరో నిముషానికి గడబిడ యింకా తగ్గి, మెల్లగా సణుగుతో నిలిచిపోయింది. మధ్యాహ్నభోజన సమయం ఐంది.

ఇప్పుడు మనుష్యుల కంఠాలూ, సముద్రపు టలల ఘోషా కొంచెం స్పష్టంగానే వినిపిస్తున్నాయి.

రేవు కూలీలు పనులు కట్టిపెట్టి గుంపులు గుంపులుగా నీడపట్టులకు చేరుతున్నారు. తినుబండారా లమ్మే స్త్రీలదగ్గర అవీయివీ కొనుక్కుని, బిగ్గరగా మాట్లాడుకుంటూ భోజనాలు చేస్తూన్నారు, చాలమంది. ఆ సమయంలోనే గ్రిష్కా ఛెల్కాష్ తీరిగ్గా నడుస్తూ వాళ్ల మధ్యకి వచ్చేడు. అతడొక పాత కేడీ. శుద్ధతాగుబోతనీ, సాహసం చాకచక్యం గల దొంగ అనీ రేవులో అందరికీ తెలుసు. కాళ్లకి జోడుగాని, నెత్తిని టోపీ గాని లేదు; పాతదై పిగులుబడుతూన్న పంట్లాం, మాసిన అద్దకపు చొక్కా; బింకంగా రాగిరంగు చర్మంతో కప్పబడిన కంఠపు యెముకలు చిరిగిన కాలరులోంచి కానవస్తూన్నాయి. చెదిరి ముఖంమీద పడిన నల్లని బూడిదరంగు జుట్టు కిందినుంచి మత్తుగా కనిపిస్తూన్నా యతని కళ్ళు. బహుశా అప్పుడే నిద్రలేచి వస్తూండి వుంటాడు. ఛెల్కాష్ తీక్ష్ణముఖంతో దొంగ కోళ్ళని కొట్టేవాడిలా వున్నాడు. ధూమ్రవర్ణంగా వున్న మీసంలో ఓ గడ్డిపరకా, మాసిన గడ్డంలో మరోటీ చిక్కుకుని వున్నాయి. చెవివెనక అప్పుడే త్రుంచిన నిమ్మరెమ్మ. ఎముకపుష్టిగల విగ్రహం. కొనదేరిన గద్దముక్కు నటునిటు త్రిప్పుతూ, పిల్లికళ్లతో దయారహితమైన తీక్ష్ణ దృష్టుల్ని బరపుతూ, పొడుగైన శరీరాన్ని కొంచెం ముందుకు వంచి, మెల్లగా అడుగులేస్తూ నడిచివస్తూన్నాడు. ఛెల్కాష్ యెవరినో

వెతుకుతూన్నట్లాతని చూపులే తెలుపుతూన్నాయి. పొడుగాటి మెర్రని గుబురుమీసం అస్తమానం పిల్లి మీసంలా కదులుతూంది. చేతులు వీపు వెనక బిగించి, పొడుగాటి వ్రేళ్ళతో ఆదుర్దాగా వీపుమీద రాసుకుంటున్నాడు. రేవులో ఛెల్కాష్ లాంటి బికారీలు వందలకొద్దీవున్నా వాళ్ళందరిలోనూ అతడు ప్రత్యేకంగా, విశిష్టంగా కనిపిస్తూన్నాడు! ఆకలిచూపులూ, యెరమీద దూకబోతూన్నట్లుగా తమాషానడకా అతనూ, ఛెల్కాష్ మైదానంలోని గ్రద్దలా వున్నాడు. పైకి తీరికగానూ, ఉదాసీనంగానూ కనిపిస్తూన్నా లోపల యెంతో జాగ్రతగా, పరీక్షగా ప్రతీదీ చూస్తూ, యెరకోసం అన్వేషిస్తూన్న గ్రద్ద లాగే నడుస్తూన్నాడు.

వార్ఫులో ఒక చోట బొగ్గుబుట్టలు నెట్టు కట్టి వున్నాయి. వాటి నీడని చాలమంది కూలీలు కూర్చుని వున్నారు. ఛెల్కాష్ వాళ్ళని సమీపించగానే ఆ గుంపులోంచి ఒకడు లేచి వచ్చి అతన్ని కలుసుకున్నాడు. అతడు బలిష్టుడు. ముఖంనిండా కముకుదెబ్బల ఆనవాళ్ళు, మెడనిండా గీరులు, పీలికలైన గుడ్డలు,— యివన్నీ అేత నంతకిాతమే జరిగిన కొట్లాటలో సంపాదించిన బాపతువై వుంటాయి! ఛెల్కాష్‌తో కలిసినడుస్తూ రహస్యంగా అన్నాడు!

"ఒరేయ్! హార్బరు ఆఫీసర్లు ఆ రెండుపాకేజీల సంగతీ పసిపట్టేరు. కూపీ లాగడానికి యెంతో జాగ్రత్తగా వెతుకుతూన్నారా!"

"ఐతే? ఏమంటావ్?" అన్నాడు ఛెల్కాష్ వాణ్ణి ఓ కంటితో పరీక్షగా చూస్తూ.

"ఐతే యేమిటా? వాళ్లు వెతుకుతూన్నా రన్నాను. అంతే!"

"దొంగని పట్టుకోడానికి నన్ను సాయంచేయమనలేదు గదా, వాళ్ళు?

ఛెల్కాష్ చిరునవ్వుతూ తీరిగ్గా నౌకాదళం తాలూకు గోదాములవైపు చూసేడు.

"నిన్ తగలెయ్యా! మొండిపీనుగవురా!" అని వాని స్నేహితుడు వెనక తిరిగేడు.

"ఒరేయ్! ఆగరా కాస్సేపు. నీముఖాన్ని ఆ అలంకారా లేమిట్రా? ఎవరో నిన్ను బాగా ముస్తాబు చేసేరులేరా! పోనీ గాని మిష్కాని చూడలేదుకదా యిక్కడెక్కడా?"

"అబ్బే! వాడు కనిపించడమే లేదురా!" అని వెళ్ళిపోతూనే కేకేసి, సహచరులవైపు నడిచి పోయేడు.

ఛెల్కాష్ని చూసి దారి పొడుగునా అందరూ చనువుగా పలకరిస్తూన్నారు. ఇదివరకెప్పుడూ చలాకీగా, పరిహాసంగా జవాబులిస్తూండేవాడు. కాని యీవేళ అతనిలో హెచ్చరికే లేదు. ప్రశ్నలకీ, పలకరింపులకీ ముక్తసరిగా, ముభావంగా జవాబిస్తూన్నాడు, ఛెల్కాష్ యీరోజెందుచేతో.

సరుకులనెట్టు వెనకనుంచి ఓ చౌకీదారు ఊడిపడ్డట్టువచ్చి ఛెల్కాష్ దారిలో నిలబడ్డాడు. సిపాయీలా నిఠారుగా,

మాసిన పసరురంగు యూనిఫారంలో బూడిదకొట్టుకున్న స్వరూపం. చౌకీదారు ఛెల్కాష్‌వైపు ధిక్కారంగా చూస్తూ, ఎడంచేతిని మొలదట్టీలోని కత్తిపిడిమీద వుంచి, కుడిచేత్తో ఛెల్కాష్ చొక్కాకాలరు పట్టుకోడానికి యత్నిస్తూ,—

"ఆగు! ఎక్కడికి?" అన్నాడు.

ఛెల్కాష్ వెనక్కి అడుగేసి, కళ్లెత్తి చౌకీదారువైపు చూస్తూ, వెగటుగా చిరునవ్వేడు. చౌకీదారు బెదిరించే వైఖరి పెట్టాలనుకున్నాడు. ఎర్రగా టొమాటాలా, కులాసాగా వుండే వాడిముఖం యీ ప్రయత్నంలో మరింత యెర్రబడి, ఉబ్బి గుండ్రనైంది. కనుబొమలు వెక్కిరిస్తూ, గుడ్లు తిరుగుతూన్నాయి. చౌకీదారు నా స్థితిలో చూసి తీరాల్సిందే!

"నీతో చెప్పానా,— లోపలికి వచ్చేవంటే యెముకలు విరిచేస్తానని? మళ్ళీ యెందుకు వచ్చేవురా?" బెదిరిస్తూ అరిచేడు చౌకీదారు.

ఛెల్కాష్ చలించలేదు. పలకరింపుగా, నిర్లక్ష్యంగా,-

"ఓహో! సెమ్యోనిచ్! క్షేమంగా వున్నావా? మనం కలుసుకుని చాలా రోజులైంది!" అంటూ కుశలప్రశ్న వేస్తూ, కరచాలనానికి చేయి చాపేడు.

"నిన్నెప్పుడూ కలుసుకోకండా వుంటే దేవుడికి వెయ్యి దండాలు! నడు! త్వరగా బైటికి నడు!"

అనడం అన్నాడేగాని సెమ్యోనిచ్, ఛెల్కాష్ చాచిన చేతిని పట్టుకోడం మానలేదు.

చౌకీదారు చేతిని గట్టిగా పట్టుకుని స్నేహపూర్వకంగా కరచాలన చేస్తూ ఛెల్కాష్ అడిగేడు.

"నాకిది కాస్త చెపుదూ? మిష్కా కనిపించేడా?"

"మిష్కా? మిష్కా యెవడు? నేను మిష్కా నెవణ్ణీ యెరగను! నడు, నడు, నేస్తమా! ఇనస్పెక్టరు చూసేడంటే నిన్ను..."

"మిష్కానే యెరగవూ? కిందటిసారి 'కోస్త్రోమా' ఓడమీద నాతో బాటు పనిచేసేడే, ఆ కుర్రాడు. రాగిజుట్టు వాడు" అన్నాడు ఛెల్కాష్, చౌకీదారు చేయి వదలకండానే.

"పనిచేసేమే, అనకు! కలిసి దొంగతనాలు చేసే వాళ్ళమే! అంటే బాగా తెలుస్తుంది. మీ మిష్కా,— వాణ్ణి ఆస్పత్రిలో పారేశారు. యినపదూలం పడి వాడిపాదం నలిగి పోయింది. వెళ్ళిపోరా, నేస్తం! మర్యాదగా వెళ్ళమన్నప్పుడే వెళ్ళు. లేదా మెడబట్టి గెంటాల్సి వస్తుంది."

"బలేవాడివే! అల్లా చెప్పు! మొదట మిష్కానే యెరగనన్నావు కదూ? వాణ్ణెనియెరుగుదువులే. పోనీ కాని, సెమ్యోనిచ్! ఈవేళ యింత చిరాకుగా వున్నావేం?"

"గ్రిష్కా! చెపుతూన్నా విను! నీ వాగుడింక కట్టి పెట్టు. నా దగ్గిర నీ ఆటలేం సాగవు. వెళ్ళిఫో!"

చౌకీదారుడికి కోపం వస్తూంది కాని ఏం చేయగలడు? ఛెల్కాష్ యినుప పిడికిలిలోని చేతిని విడిపించుకోవాలని యత్నిస్తూ దిక్కులు చూస్తూన్నాడు. పట్టు వదలకుండానే,

గుబురుగా పెరిగిన కనుబొమల క్రిందినుంచి తాపీగా చూస్తూ మాటలాడుతూన్నాడు, ఛెల్కాష్.

"నన్ను వేగిర పెట్టకు, భాయీ. నీతో మాట్లాడాల్సిన నాలుగు ముక్కలూ ఐపోగానే నేనే వెళ్ళిపోతా. అంతే. ఏమంటావ్? నీ పనెల్లావుంది? పిల్లా మేకా అంతా కులాసా?"

కుశల ప్రశ్న వేస్తూన్నాడేగాని ఛెల్కాష్ కండ్లలో అసహ్యం, నిరసనా తొలుకాడుతూన్నాయి. పళ్ళు కనిపించేలా నవ్వుతూనే,—

"ఎన్నాళ్ళుగానో నిన్నోమాటు చూసి పోవాలనుకుంటా. లాభమేమిటి? టైము చిక్కడమే లేదు! అస్తమానం త్రాగడంతోనే సరిపోతోంది. నువ్వెరగనిదేముంది, భాయీ!"

"సరేలే. ఇప్పుడా గోలంతా యెవడడిగేడు నిన్ను? చెయ్యొద్దులు. నిన్నే! వేళాకోళం కాదు. తెలుసా? మొండి పీనుగువి! వదలవేం? ఐతే నీపని సంసారులకొంపలు దూరడం దాకా వచ్చిందన్నమాట! ఇం.కేం? వీధుల్లోనే జేబులు కొడుతూండు!"

"అబ్బే, అంతకర్మమేంవచ్చింది. భాయీ! ఇక్కడ సరుకులు లేవుగనుకనా? ఈ సరుకే మనతరం వెళ్లదీస్తాయి. నీ తనువూ, నా తనువూ గడిచిపోతాయి దేవుని దయవల్ల! సెమ్యోనిచ్! మన కిక్కడిది చాలులే. ఐతే, ఆ రెండుపెట్టెల సామానూ కాజేసింది నువ్వే నన్నమాట! జాగ్రత్తసుమా! చూసుకుంటూండు. లేకపోతే మేదోరోజున దొరికిపోతావు!"

సెమ్యోనిచ్‌కి ఒళ్లు దహించుకుపోతూంది. కోపంతో వణు కుతూ, యేదో చెప్పుదామని గింజుకుని, కొట్టుమిట్టాడేడు. ఛెల్కాష్ అతనిచేయివదలి, హార్బరుద్వారందగ్గరికి తాపీగా నడుస్తూంటే, అతని వెనకే బూతులు తిడుతూ చౌకీదారు వెంబడించేడు. చౌకీ దారు తిడుతూన్నకొద్దీ ఛెల్కాష్‌కి హుషార్ హెచ్చుతూంది. పలువరసకి నాలుక తాటించి హైఁ! మని యీలవేస్తూ, పంట్లాం జేబుల్లో చేతులుంచుకుని తీరికమనిషిలా తాపీగా నడుస్తూ, అటూయిటూ వున్న కూలీలవైపు చమత్కారోక్తులు విసు రుతూ నడుస్తూంటే కుడియెడమలనుంచి అతని పరిచితులూ అదే స్థాయిలో మోటుగా వేళాకోళా లాడుతున్నారు.

"ఒశేయ్! గ్రిష్కా! నీమీద గవర్నమెంటు కెంత శ్రద్ధరా!" అప్పుడే భోజనం కానిచ్చి, చెట్టునీడని విశ్రమిస్తూన్న కూలీల్లో ఒకడు కేకేసేడు.

"నిజమేరా! నాకు జోళ్లు లేవుకదూ? అంచేత నాకాళ్ళ కేదైనా తగిలి గాయం కాకండా చూడ్డానికని యీ సెమ్యో నిచ్‌ని నావెనక కాపలా పంపేర్రా!"

ఛలోక్తులాడుతూ మెల్లిగా ద్వారం దగ్గరికి సమీ పించేరు; అక్కడ కాపలా కాస్తూన్న సిపాయీలు ఛెల్కాష్‌ని తడిమి సోదాచూసి, మెల్లగా బైటికి నెట్టేసేరు.

ఛెల్కాష్ రోడ్డుదాటి, సత్రానికెదురుగావున్న రాతి మీద కూర్చుని, యెడ తెగకుండా తోరణాల్లా హార్బరులోంచి వస్తూన్న సరుకులబళ్లని చూస్తూన్నాడు. ఖాళీబళ్లు కుదుపుతూ

తో లేవాళ్ళని క్రిందికీ మీదికీ యెగరేస్తున్నాయి. హార్బరు గేట్లోంచి రణగుణ ధ్వనీ, కాలే బూడిదా కక్కినట్లు వస్తూన్నాయి.

వీటి కలవాటు పడిన ఛెల్కాష్ స్థిమితంగా కూర్చుని, హుషారుగా ఈలేస్తున్నాడు. అతని మనోనేత్రం ముందు పళ్లగంప ప్రత్యక్షమై ఆహ్వానిస్తూన్నట్లే వుంది. కాస్త శ్రమా, కొంచెం నేర్పూ,-యివుంటే చాలు, పని జరిగిపోతుంది! నేర్పుకేం వచ్చెగాని, అది ఛెల్కాష్ దగ్గర కావలసినంత వుంది. యీ వ్యవహారం కాస్తా పూర్తికాగానే మరునాడు వుదయం జేబునిండా నోట్లు ఫెళఫెళ్లాడుతూంటే, తృప్తితీరా త్రాగి కుషామత్ చేస్తూంటే కలిగే ఆనందాన్ని తలుచుకుని, కన్నులరమోడ్చి కలలుగంటున్నాడు అప్పుడే! ఇంతలో సహచరుడు మిష్కా జ్ఞాపకం వచ్చేడు. వాడు కాలు విరగ్గొట్టుకోకండా వుంటే యీరాత్రి యెంత వుపయోగంగా వుండేవాడు? మిష్కా సాయం లేనిదే యీపనిని తాను ఒక్కడూ చేయలేడు. తన దురదృష్టాన్ని తిట్టుకుంటూ, ఆకాశం వైపూ వీధివైపూ చూడనారంభించేడు.

అతనికి సమీపంలోనే యింకోరాతి నానుకుని కూర్చుని వున్నాడో పడుచువాడు. ముతుక నీలిచొక్కా, అదేరంగు పంట్లాం, కాళ్ళకి కొయ్యచెప్పులు, చిరిగిన యెర్రటోపీ-యిదీ అతని వేషం. వాని ప్రక్కనే ఓ చిన్నమూటా, పిడిలేని కొడ

వలీ వున్నాయి. కొడవలికి గడ్డిపరకలు చుట్టి, చిన్నతీగతో బిగించేడు. వెడల్పైన వక్షం, బలమైన శరీరం, నారలాటిజుట్టు, పెద్ద నీలికళ్ళు, ఎండ వానలకు గురై రంగు మాసిన వర్చస్సు గల్గిన ఆ పడుచువాడు అమాయికత్వం, ఆత్మవిశ్వాసం ఉట్టిపడే చూపులతో ఛెల్కాష్ వైపు చూస్తూన్నాడు.

ఛెల్కాష్ కొంటెతనంగా నాలుక వెళ్ళబెట్టి వెక్కిరిస్తూ, ముఖం భీకరంగా చేసుకుని, గుర్రురుముతూ ఆయువకుని వైపు చూడనారంభించేడు.

మొదట్లో వాడు ఆశ్చర్యంతో తెల్లబోయినా, కొంచెం సేపట్లోనే గ్రహించుకుని, పకపకా నవ్వనారంభించేడు.

"హ్హాఁ! హ్హాఁ! హ్హాఁ! ఓరి పిడుగా! నువ్వెవడివో అసాధ్యుడిలా వున్నావే!"

బిగ్గరగా అరుస్తూ, సగం లేచి, మూటని దుమ్ములో యీడుస్తూ, కొడవలి చప్టారాళ్ళమీద ఖణేల్‌మని చప్పుడు చేస్తూంటే, తూలిపడుతూన్నట్లు దొర్లుకుంటూ ఛెల్కాష్ కూర్చున్న చోటికి పోయేడు.

"ఏం నేస్తమా! కొంచెం డోసు యెక్కువైనట్లుందే? ఏం కథ?" ఛెల్కాష్ పంట్లాం లాగుతూ అడిగేడు రైతు.

"ఔనురా, బుల్లోడా! నువ్వన్నది నిజమే!" అని యదార్థం అంగీకరించేడు, ఛెల్కాష్. ఆరోగ్యంగా, అమాయికంగా, స్వచ్ఛమైన నేత్రాలతో చంటిపిల్లవానిలా వున్న యువకుణ్ణి చూసేసరికి అతనికి మమత కలిగింది.

"కోతలకి వెళ్ళేవనుకుంటా, ఏం?"

"ఔను. కాని ఏం కోతలో, పాడో! పావలా డిబ్బులకు కన్నుపారినంత మేర కొయ్యాలి. కూలీజనం యిసకపాతరలా వున్నారు. కరువు ప్రాంతాల జనంట! త్రొక్కిసలాటే అనుకో. ఇంక రేట్లసంగతి అడిగేదేమిటి? వాళ్ళమూలాన కూట్లో దుమ్మడింది. పోయిన సంవత్సరాల్లో నాలుగైదు రూబుళ్ళు యిచ్చేవారట! ఇప్పుడో! కూబాన్‌లో రోజుకి అరవైకో పెకుకలిస్తున్నారు!"

ఛెల్కాష్ అందుకున్నాడు:

"పోయిన సంవత్సరాల్లోనే కాదు. అసలు రష్యన్ జాతివాడూ అంటూ కనిపిస్తేనే ఆప్రాంతాల్లో మూడు రూబుళ్ళు యిచ్చేవారు. పదేళ్ళక్రితం నాకు అదేపని! ఏ కమతంలోకో వెళ్ళడం; 'నేను రష్యన్‌ని' అనే సరికి జనం విరగబడి చూస్తూ, ముట్టుకు చూచి ఆశ్చర్యపడిపోయే వాళ్ళనుకో! అంతే. నీకు మూడు రూబుళ్ళు ముట్టేవి. దాంతో సరా? కడుపునిండా తిండానికీ, త్రాగడానికీ లోటు లేదు. ఎన్నిరోజులున్నా సరే!"

ఛెల్కాష్ మాటల్ని రైతు యువకుడు నోరు తెరుచుకు వింటూంటే ఆతని ముఖం ఆశ్చర్యంతో వికసించి గుండ్రనైంది. కాని, కాస్సేపట్లోనే వీడివన్నీ కోతలని గ్రహించి, లొట్టలు వేస్తూ, పకపకా నవ్వారంభించేడు. ఛెల్కాష్‌కూడా నవ్వును మీసాల చాటున దాచుకుంటూ, ముఖం గంభీరంగా పెట్టి చెపుతూనే వున్నాడు.

"పోవయ్యా! అదంతా నిజంగా జరిగినట్టూ, నేను నమ్ముతూన్నట్టూ కోస్తూన్నావే! అబ్బే! కాదు కాని, వెనకటిరోజుల్లో......!"

"మధ్యలో అడ్డురాకు. నే చెప్పింది అబద్ధం అనుకుంటున్నావా? వెనకటిరోజుల్లో జరిగిన దాన్నే చెప్పేనురా, అబ్బాయ్! నమ్మకపోతే పో!"

"సరే, కాని నువ్వేంపని చేస్తావు? జోళ్ళు కుడతావా? దర్జీపనా? లేదా......" అంటూ యువకుడు సాభిప్రాయంగా చెయ్యి ఊపేడు.

"నేనేనా?" అని ప్రశ్నించి చెల్కాష్ ఒక్క నిముషం ఆలోచించి,

"నేను జాలరివాణ్ణి!" అన్నాడు.

"జాలరివే? నిజంగా? నువ్వు చేపల్ని పడతావా? మరి వేటినేనా..."

"చేపల్నే అన్నమాటేమిటి? ఇక్కడి జాలరివాళ్ళు చేపల్నేకాదు పట్టడం. మునిగిపోయిన వాళ్ళకోసం, పాత లంగర్లకోసం, మునిగిన పడవలకోసం, — యిల్లాటి వాటన్నిటికోసమూ వలలేస్తాం, మేము! వీట్లన్నిటికీ ప్రత్యేకంగా గాలాలున్నా యిక్కడ!"

"కావచ్చు. నాకోపాట వచ్చు, పాడనా?

విసరవోయ్ బెస్తవాడా,

నీవల వేయవోయ్ మాయవాడా!

నీరులేనీ గదులలోనూ,

నోరులేనీ సరుకుపైనీ..."

రైతు యువకునివైపు తిరిగి నవ్వుతూ, ఉపాలంభనగా అడిగేడు, ఛెల్కాష్.

"ఏమిటీ! అల్లాటిబెస్తవాళ్ళ నెక్కడేనా చూసేవా?"

"అబ్బే! అల్లాటి వాళ్ళని నేను చూడలేదు. గాని చెప్పుకోడం విన్నానంతే."

"నీకు అల్లాటి వాళ్ళంటే యిష్టమేనా?"

"ఇష్టమా అంటావా? ఏమో? కావచ్చు. వాళ్ళు మాంచి ధైర్యం గలవాళ్ళు. స్వేచ్ఛగా......"

"నీకూ స్వేచ్ఛగా వుండాలని వుంటుందా?"

"ఆఁ! వుంటుంది. పైన పెత్తనం చెలాయించేవా డుండడు. ఎక్కడికి వెళ్ళు, ఏం చెయ్యి, అడిగే వాడుండడు. నెత్తిమీద మొట్టే యజమాని లేకుండా స్వతంత్రుడుగా వుండడం నయమేకాదూ? మెళ్ళో గుదిబండ లేకండా, పొడిచే ముల్లుకర్ర లేకుండా వుంటే యెంత బాగుంటుంది? ఎట్లా ప్రవర్తించాలో మాత్రం తెలిసి వుండాలి. ఇష్టం వచ్చినట్లు అనుభవించవచ్చు. కాని దేవుణ్ణి మాత్రం మరిచి పోకండా..."

ఛెల్కాష్ నిరసన సూచకంగా ఉమ్మేసి, వెనక తిరిగి, మాట్లాడక వూరుకున్నాడు.

రైతు యువకునికి యీ ప్రసక్తి రావడంతో హుషార్ కలిగిందేమో, అత డూరుకోలేక పోయేడు.

"స్వతంత్రం అంటే నాకు అర్థమవుతూంది, యిప్పు డిప్పుడే. నా సంగతే చెపుతా, విను. నా తండ్రి చనిపోయేడు. తల్లి ముసలిది. ఉన్న భూమికాస్తా సారం చచ్చి, పనికిమాలిం దిగా వుంది. మేము జీవించాలంటే యెట్లాగ ? మాగతిచూసేవా డెవడున్నాడు ? ఏ స్థితిమంతుల యింటిపిల్లనో చూసి పెళ్ళిచేసు కుంటే బాగుండదూ ? తప్పకుండా నాకది యిష్టమే. కాని, వాళ్లు కుమార్తె భాగం పంచియిచ్చేస్తారా ? అఁహఁ ! మామ ముండావాడు అట్లా చేయడాని కెంతమాత్రం అంగీకరించడు. నేను వాడియింట్లో పడుండి, చచ్చేదాకా బానిస చాకిరీ చేస్తూండాలిట ! నీకు మాత్రం తెలియదా ? మామయింట్లో వుండడం ఏం మగతనం ? నాకే కనక వందో రెండొందలో వుంటే నాకాళ్ళమీద నేను నిలబడగలను. అప్పుడు నాకొకడి ప్రేక్ష్యమేమిటి ? ముసలి ఆంటిప్ని నిలబెట్టి అడుగుతా : మార్ఫా భాగం విడదీసి యిస్తావా ? యివ్వవా ? ఇవ్వకపోతే పోనీ. మార్ఫాలాంటివాళ్ళు మావూళ్లో యింకా యెంత మందో వున్నారు. దేవుని దయవల్ల ఆడపిల్లలకు కొరత రాలేదింకా ! అప్పుడు స్వతంత్రంగా, స్వేచ్ఛగా వ్యవహరించ గలను కదా ?

రైతు యువకుడు నిట్టూర్చి, ఒక్కక్షణం వూరుకుని నిర్వేదంతో మళ్ళీ ప్రారంభించేడు.

"కాని నాకా రాత లేందే ! కూబాన్ వెళ్ళి యేదో రెండొందలు సంపాదించుకు వద్దామనీ, స్వేచ్ఛగా బతకొచ్చు

నని తలచేను. నా ఆలోచన యేమీ సాగలేదు. నా ప్లానంతా బుసిగి పోయింది. ప్రస్తుతం యింక చెయ్యడాని కేమీ కని పించదు. మార్ఫాని పెళ్లాడి, మామయింట చాకిరీ చేస్తూ బ్రతకాల్సిందే. పాలేరులా బ్రతకమని నా నొసట రాసుం దేమో! స్వంత పొలం, స్వంత కమతం అంటూ యెప్పటికీ సంపాదించనే లేనేమో? అయ్యో!"

ఆ పడుచువానికి కాబోయే మామదగ్గర పడుండడం అనే దేమాత్రం యిష్టంగా వున్నట్టులేదు. అదే తనగతి అను కొనేసరికి వాని ముఖంలో విషాదచ్ఛాయలు అలుము కున్నాయి. ఆ ధూళిలోనే చతికిలబడి బాధతో కొట్టుమిట్టా డేడు. ఛెల్కాష్‌కి జాలేసింది.

"ఇప్పుడు నువ్వెక్కడికి వెడుతున్నావ్?"

"ఎక్కడి కేమిటి? ఇంకెక్కడి కెడతాను, గంగలోకి! ఇంటికే!"

"నేను నమ్మను నేస్తమా! నువ్వు యే టర్కీకో పోదామని చూస్తూన్నా వేమో?"

"టర్కీకా? ఎందుకూ? మంచి క్రైస్తవుడెవడూ అక్కడికి పోడు. ఒకరిమాటకేం గాని నేనుమాత్రం అక్కడి కెప్పుడూ వెళ్లను!" అని సాగదీసుకున్నాడు రైతుయువకుడు.

"ఓరి మూర్ఖుడా! నీదగ్గర చాదస్తాని కేమీ తక్కువ లేదు!" అంటూ నిట్టూర్చి, ముఖం త్రిప్పేసుకున్నాడు, ఛెల్కాష్. ఆరోగ్యంగా దార్ఢ్యంగా వున్న యీరైతు అతనిలో పరస్పర

విరుద్ధాలైన భావాల్ని రేకెత్తిస్తూన్నాడు. హృదయపు లోతుల్లో ఆందోళనను రేకెత్తించి, అతనిని ఆ రాత్రి కార్యక్రమాన్ని గూర్చి ఆలోచించనీయకుండా చేస్తూన్నాడు!

ఛెల్కాష్ ముఖం త్రిప్పుకున్నా ఆ యువకునికి వాడితో మాట్లాడాలనేవుంది. సణుగుతూ, అప్పు డప్పుడు క్రీగంట వాని వైపు చూస్తూనేవున్నాడు. ఆ పడుచువాడు తన సంభాషణ యీ విధంగా హఠాత్తుగానూ, తన కవమానకరంగానూ ముగుస్తుం దనుకో లేదు; అందులోనూ యీ బికారివాడితోనా! ఉద్రేకంతో వాని చెక్కిళ్లుబ్బి, పెదవులు విడి, గుడ్లుతిరిగి తమాషాగా తయారయేడు. ఈల వేస్తూ, ఛెల్కాష్ మాత్రం మళ్లీ రైతువైపు చూడనేలేదు. ఈలవేస్తూ, తనుకూర్చున్న రాతిబండమీద జోడు లేని కాలితోనే తాళం వేస్తూ, యింకో వైపు తిరిగి కూర్చున్నాడు.

దారేపోయేవానితో స్నేహపూర్వకంగానే విడిపోడం మంచిదని తోచింది, రైతు కుర్రవాడికి.

"ఇదిగో! బెస్తా! నువ్వురోజూ యిల్లాగే తాగివుంటూంటావా?" అనడుగుతూంటే, వాడే హఠాత్తుగా యువకునివైపు తిరిగి ప్రశ్నించేడు:

"ఏం, కుర్రాడా? ఈ రాత్రికి పనిచెపుతా. చేస్తావా? బాగానే ముడుతుందిలే. ఏం? చెప్పు!"

రైతుకి నమ్మకం కలగలేదు.

"ఏం పనేమిటి?"

"ఏమిటా? నే చెప్పే పనే! మనం చేపలు పట్టడానికి పోవాలి. తెడ్లు వెయ్యగలవా?"

"ఓ! వెయ్యగలను. నాకు పనంటే సరదాయే. నువ్వు చెప్పినపని చేస్తాను. గాని ఒక్కసంగతి నీతో ముందుగానే చెపుతే మంచిది. ఏవో గొడవల్లో పడడం నాకేమీ యిష్టం వుండదు. నీ లోతు తెలియడంలేదు. నీ వాలకం చూస్తే నా కనుమానంగానే వుంది, చెప్పొద్దూ?"

ఛెల్కాష్‌కి గుండెల్లో కాల్చిన ట్లనిపించింది. కాని కోపం పైకిరానీక మెల్లగానే,—

"నువ్వు మనసులో యేమనుకున్నా పైకి వాగకుండా నోరుమూసుకుని వుండడంమంచిది. లేకపోతే మాడుపగలగొట్టి, బుర్ర మరమ్మతు చేస్తా!"

అంటూ ఒక్కదుముకున లేచి నిల్చుని యెడం చేత్తో మీసం మెలివేస్తూ, కండలుదేరిన కుడిచేతిపిడికిలి బిగించి పైకెత్తేడు. అతని కళ్లు నిప్పులుకురుస్తూ మెరుస్తూన్నాయి.

రైతుకుర్రాడికి భయంవేసింది. మిడుతూ మిడుతూ దిక్కులుచూస్తూ, దిగాలుపడిపోయి లేచినిల్చున్నాడు. వాళ్లిద్దరూ ఒకరికొకరు అభిముఖంగా నిలబడి, మాట్లాడకుండా, కళ్లతోనే ఆకళింపు చేసుకుంటూ ఒక్కనిముషం నిలబడిపోయేరు.

"ఏం? కోపంగా, బెదరింపుగా అన్నాడు, ఛెల్కాష్. వీడెవడో కుర్రకుంక తన్నంత మాటంటాడా? అని అతనికి లోపల రగులుతూంది. వాణ్ణి పలకరించి మాట్లాడేడే గాని

అప్పుడూ వాడిమీద అసహ్యంగానేవుంది అసలు; ఇప్పుడింక వానిమీద ద్వేషమే బయలుదేరింది. వాడి తేటయిన నీలి కళ్లూ, ఎండకి కమిలిన ఆరోగ్యమైన ముఖవర్చస్సూ, బలంగా పుష్టిగావున్న అవయవాలూ,- ఇవి చూస్తేనే ఛెల్కాష్‌కి మంట పుట్టింది. కాగా వాడికి స్వగ్రామం, అందులో ఓస్వగృహం వున్నాయిట! పైగా ఓ ధనికరైతు తన కూతుర్ని వీడికిచ్చి, యింట్లో అట్టే పెట్టుకోవాలని చూస్తూన్నాడు! ఇల్లూ వాకిలీ, భూమీపుట్రా, పెళ్లాం తల్లీ,-యీ బంధనాల్లోనే గానుగెద్దులా తిరుగుతుండే యీ రైతుకుర్రాడి జీవితం, అప్పుడూ యిప్పుడూ ముందూకూడా ఒకేవిధంగా యేమార్పూ లేకుండా జరుగుతుంది. ఇల్లాంటివాళ్ళని చూస్తే ఛెల్కాష్‌కి పరమాసహ్యం. అంతతో పోకండా వీడూ స్వేచ్ఛా, స్వాతంత్ర్యం అంటూ పలవరిస్తూన్నాడు! గతానుగతికంగా పోయే యీ రైతుకు స్వతంత్రం అంటే అర్థం తెలీకపోయినా, స్వేచ్ఛ వాడికక్కర్లేక పోయినా, అవి కావాలనడం చూస్తే యెవడికేనా అసహ్యం వేస్తుంది, మరి!

నీకంటె హీనుడని నువ్వనుకుంటూన్న ఆసామీకూడా నీయిష్టానిష్టాలవంటివే కలిగివున్నాడనీ, నీతో సమానధర్మాలు గలిగివున్నాడనీ, ఆ విధంగా నీతో సమానఫాయాలో వున్నాడనీ తెలుసుకుంటే యెవడికేనా అదోలా వుంటుంది! తన సొమ్మేదో పోయినట్లూ, తనకేదో అన్యాయం జరిగినట్లూ

అసంతోషంగా, ఆవ తిన్న పసరంలా గిలగిల్లాడిపోతాడు! అది స్వభావం!

రైతు యువకునిలో పరుగిడుతూన్న భావాలు వేరు. అతని కేశవభిషలూ అక్కర్లేదు. ఛెల్కాష్ ఎవడైతేనేం? ఎల్లాటివాడైతేనేం? తనకేదో పనిచెపుతాడు, నాలుగుడబ్బులు ముట్టచెపుతాడు. అంతే. బస్. అతని మనసుకి సమాధానం కుదిరింది. ఛెల్కాష్‌వైపు చూస్తూ,—

"అల్లాగే. నీతో నాకేం పేచీకి? నేనూ పనికోసమేగదా చూస్తూన్నా. ఎవరు పనిచెపితే నాకేం? అల్లాటి పట్టింపు నాకు లేనేలేదు. నువ్వో, మరొకరో, యెవరో ఒకరు! నేనన్నదేమీ లేదు. నువ్వు పనిచేసేవాడిలా కనిపించలేదు; బట్టలు మరీ పాడుగా చిరిగివున్నాయి. దైవసాక్షి! నాకేం దురుద్దేశ్యంలేదు. ఎందర్నో త్రాగుబోతుల్ని చూసేను, నేనూ. నిన్ను మించిన వాళ్ళనే యెరుగుదును. ఎవరియిష్టం వాళ్లది! ఏం?"

ఛెల్కాష్ సమాధానపద్ధతిలోనే వున్నాడు:

"సరే, సరే! ఐతే అంగీకరించేవన్నమాటేనా?"

"ఓ! సంతోషంగా! షరతులేమిటో చెప్పు."

"పనినిబట్టి వుంటాయి. అంటే మనకి దొరికేదాన్నిబట్టి వుంటాయన్నమాట. రోజుబాగుంటే నీకు ఐదు రూబుల్సు దొరకవచ్చు. తెలిసిందా?"

కాని యిది డబ్బువిషయం. రైతు యీ విషయంలో ఖచ్చితంగా వుంటాడు! రెండోవాడు కూడా ఖరాఖండిగా వుండాలనే కోర్తాడు.

రైతుయువకునిలో మళ్ళీ అనుమానం, అపనమ్మకం విజృంభించేయి.

"నేస్తం! అది నా పద్ధతిగాదు. వ్యవహారంలో మనంఖరా ఖండీగా వుండాలనే నా ఉద్దేశ్యం."

ఛెల్కాష్ ఒక్కనిముషం ఆలోచనలో పడ్డాడు. తనకి జంకు యెప్పుడూ లేదు.

"ఊరికే అడ్డుగోలుగా వాదించకు, అబ్బాయీ! రా, హోటలుకిపోయి కాస్త కడుపు చల్లబరుచుకుందాం."

వాళ్ళిద్దరూ ఒకరిప్రక్క నొకరు నడుస్తూ హోటలు వైపు బైలుదేరేరు. ఛెల్కాష్ యజమానిలా దర్జాగా మీసాలు మెలిత్రిప్పుతూ నడుస్తూంటే, రైతుయువకు డాతని ప్రక్కనే వినయవిధేయత లుట్టిపడేలా నడుస్తూన్నాడు. కాని ఆతనిలో యింకా అపనమ్మకం, అసంతుష్టి ద్యోతకం అవుతూనే వున్నాయి.

"నీ పేరేమిటి?" ఛెల్కాష్ అడిగేడు.

"గవ్రిలా!" క్లుప్తంగా జవాబిచ్చేడు, రైతు.

కొంచెం సేపట్లో యిద్దరూ హోటల్‌లో ప్రవేశించారు. లోన అంతా అసహ్యంగా, పొగచూరి నల్లగావుంది. రేవులో జనంకోసమే ఆ హోటలు. ఛెల్కాష్ అక్కడ పాతకాపే. అతడు సరాసరి యజమానిదగ్గరికి పోయి కావలసిన వాటికి ఆర్డరిచ్చేడు. ఓ సీసా వోడ్కా, కాబేజీపులుసు, రొట్టె, తొడ ముక్క, టీ,- యివి తెమ్మని నౌకరుతో యజమాని చెపుతూంటే, ఛెల్కాష్ వానితో ముక్తసరుగా,

"అవన్నీ అక్కడ పెట్టు." అన్నాడు.

నౌకరు తలవూపి వెళ్ళిపోయేడు. చింకిగుడ్డలు కట్టుకుని బికారీలావున్నా తనయజమాని పెద్దవాళ్ళల్లో పరిచయం, పలుకుబడి గలవాడని రైతు గ్రహించేడు. ఛెల్కాష్ యందు నమ్మకం, గురీ యేర్పడిం దాతనికి.

"తిండి తిన్నాక వివరాలు మాటాడుకుందాం. ఇక్కడే కాస్సేపు కూర్చో. ఇప్పుడే వస్తా."

అంటూ ఛెల్కాష్ బైటికి వెళ్లేడు. గవ్రిలా హోటలు నాలుగువైపులా కలియజూచేడు, ఏం తోచక. అది క్రింది అంతస్తు. నేల బారుగా వుందేమో అంతా చెమ్మగా, చీకటిగా వుంది. వోడ్కా, పొగాకు, తారు, మసాలా వాసనలు, మానవుల చెమటకంపు,-యివన్నీ కలిసిన విలక్షణమైన ఒక వాసన అదంతా వ్యాపించి వుంది. గవ్రిలా కెదురుగా యింకో టేబిలు దగ్గర నావికుని దుస్తుల్లోనున్న ఒకడు త్రాగి మత్తుగా కూర్చుని వున్నాడు. వాడి శరీరం అంతా తారూ, మసీ, బొగ్గు బూడిదా పడి అసహ్యంగా వుంది. గడ్డంనిండా రాగివెంట్రుకలు ఒత్తుగా పెరిగి, మాసివున్నాయి. నిముష నిముషానికీ దగ్గుతూ అస్పష్టంగా కూనిరాగంతో యేదో పాడుతున్నాడు. గొంతు వాని కంఠోలిలులో లేదోమో ఒకప్పుడు బొంగురుగానూ, మరొకప్పుడు సన్నగానూ దానియిష్టం వచ్చినట్లుగా వస్తూంది, స్వరం. పాట వరసనిబట్టే వాడు రష్యను కాదని తెలుస్తూంది. ఆ వెనకగా యిద్దరు మోల్డావియను స్త్రీలు కూర్చుని, మత్తె

క్కిన స్వరాలతో సన్నగా పాడుతున్నారు. ఎండకి కమిలిన శరీరచ్ఛాయ, నల్లటి తలకట్టు, చిరిగిన బట్టలుతోవున్న ఆస్త్రీలు పాడే పాట వింటే సంతోషం యెవరికీ కలగదు. త్రాగి మత్తెక్కి గోలచేస్తూండే మానవవిగ్రహాలు ఆపైన చీకట్లోంచి ఛాయల్లా కానవస్తూన్నాయి.

అక్కడ ఒంటరిగా కూర్చోడం గవ్రిలాకి యెంతో బాధనిపించింది. యజమాని త్వరగా వచ్చేస్తే బాగుండు ననుకున్నాడు. హోటలులోని గోల అంతకంతకి హెచ్చుతూన్నట్లుంది. ఈ చెమ్మచీకటి కొంపలో బంధించబడి పోయి, విడివడి బైట స్వేచ్ఛగా వుందామనుకున్నా దారి దొరక్క కొట్టుకొనే యేదో భయంకర మృగం యొక్క సహస్రకంఠాల్లోంచి వచ్చే కోపపు అరపుల్లాగ హైం! బాయ్ం! మని తారస్థాయిలో వుందా గోల. హోటలు నాలుగు మూలలా పరికిస్తుంటే గవ్రిలాకి బుర్ర తిరిగిపోయినట్లైంది. ఏదో మత్తు కలిగించి, సర్వావయవాల్నీ స్థంభింపజేసి, కళ్ళు చీకట్లు గమ్మించి, క్రుంగదీస్తూన్నట్లుగా బాధపడ్డాడు.

మరికొంచెం సేపట్లో ఛెల్కాష్ లోనికి వచ్చేడు. ఇద్దరూ తిండి ప్రారంభించేరు. తింటూ, త్రాగుతూ, బాతాఖానీ వేస్తూంటే తన్ను క్రుంగదీసిన భావం గవ్రిలా మీదనుంచి సడలిపోయింది. మూడోగ్లాసుకే మత్తెక్కి దిలాసా బైలుదేరింది. ఏదో మాట్లాడాలనీ, హుషారుగావుండాలనీ కోరిక గవ్రిలాలో తీవ్రమైంది. అతనిలో భావాలు ఊరికే పరుగెడు

తూన్నాయి. యజమాని ఎంత మంచివాడు! తనేపనీ చేయకండానే ముందుగా మాంఛి భోజనం పెట్టేస్తూన్నాడు! అంత ఉదారమైన వాడికి సంతోషం కలిగించే మాటలు కొన్నైనా ఆడకపోతే బాగుండదు! అతని లోపలనుంచి మాటలు తరంగాలుగా పెల్లుబికి వస్తూన్నాయి. గాని కంఠందగ్గరకి వచ్చి ఆగిపోతూన్నాయి. నాలిక బరువెక్కి, మొద్దుబారి మాట పెగిలిరావడం లేదు.

ఆ పడుచువాడి బాధనంతా చూసి, చిరునవ్వుతూన్నాడు, ఛెల్కాష్.

"అప్పుడే నీ బుర్ర తిరిగిపోయిందే! థూత్! ఐదు గ్లాసులకే! ఇంక నువ్వేంపని చేస్తావురా, చంటోడా!"

గ్రవిలాకు మాట రావడంలేదు. సణుగుతూన్నాడు.

"నేస్తమా! ఏమీభయపడకు. నువ్వు చెప్పినపని చేస్తే సరికదా? ఏం? ఏదీ? నిన్నొక్కసారి ముద్దెట్టుకోనియ్యి!"

'రా! రా! ఇదుగో, యీ చుక్కకూడా పుచ్చుకో!"

గ్రవిలా ఆ గ్లాసుకూడా త్రాగేడు. అతని కళ్ళముందు అన్నీ క్రిందికీ మీదికీ తిరిగిపోతూన్నాయి. యేం బాగులేనట్లూ, వంట్లో జబ్బుగావున్నట్లూ అనిపించింది. ముఖంలో మాత్రం యేదో వెర్రిసంతోషం కనిపిస్తూంది. మాట్లాడాలని ప్రయత్నించి, వికారంగా పెదవులు నాలుకతో తడుపుకొని, అరవులారంభించేడు. ఛెల్కాష్ క్రీగంట వాణ్ణి పరీక్షగా చూస్తూ, మీసం మెలేస్తూ, దిగులుగా చిరునవ్వుతూన్నాడు.

హోటలంతా త్రాగుబోతుల గోలతో మారుమ్రోగు తూన్నా కొందరు నిద్రబోడాని కే అభ్యంతరం గలిగినట్లు లేదు! రాగిజుట్టు నావికుడు టేబిలుమీద మోచేతు లానించి గాఢసుషుప్తిలో వున్నాడు. ఛెల్కాష్ లేస్తూ గవ్రిలాతో,—

"రా! పోదాం!" అన్నాడు.

గవ్రిలా లేవడానికి ప్రయత్నించి విఫలుడై కసిగా బూతులు తిడుతూ అర్థంలేని త్రాగుబోతునవ్వుతో విరగ బడ్డాడు. ఛెల్కాష్ బైలుదేరినవాడు మళ్ళీ కుర్చీమీద చతికిల బడ్డాడు,—

"బాగా మత్తెక్కిందే!"

ఛెల్కాష్ వైపు నిర్జీవనేత్రాలతో మిటకరించి చూస్తూ గవ్రిలా అట్టహాసం చేస్తూనేవున్నాడు. సాలోచనగా, ఆసక్తితో, బహుజాగ్రతతో చూస్తూన్నా డీ రైతుకుర్రాణ్ణి, ఆగజదొంగ. బలిష్ఠుడైన యీ పడుచువాడి జీవితం తన యినుప పిడికిలిలో చిక్కివుందని తట్టింది, ఛెల్కాష్కి. వాని జీవితం తన కిచ్చవచ్చిన రీతిగా చేయగలడు! వాని జీవికను చింకి పాతలా చీల్చి పారవేయనూగలడు. లేదా ఆకర్షణీయమైన పల్లె పరిసరాల్లో సుప్రతిష్టించనూగలడు! ఇంకో మానవుని జీవితంమీద తానొక అధికారి! రక్షకుడు! పీనిబాధ్యత తనదే! తా ననుభవించాలని విధి యే విషఫలాల్ని నిర్ణయించిందో వాటిలోనించి ఒక్క పిసరుకూడా యీ కుర్రవాణ్ణి తిన నీయడు. ఈ పడుచురైతు జీవితాన్నీ, అదృష్టాన్నీ గూర్చి

తలపోస్తూంటే ఛెల్కాష్ మనస్సులో పరస్పర విరుద్ధమైన భావాలు ఒక్కుమ్మడిగా ముప్పిరి గొన్నాయి. వానిపట్ల కారుణ్యం, అసూయ, ఆసక్తి, ద్వేషం, అభిమానం—అపహాస్యం,— యీ పరస్పరవైరుధ్య భావాలతో చూస్తూ, వీడు తన చేతుల్లో యెల్లా యిరుక్కున్నాడా? అని ఆశ్చర్య పడుతూన్నాడు.

కొంచెంసేపులో యీ భావాలన్నీ కలగాపులగమై పితృప్రేమ, మాతృవాత్సల్యం కలిసిన అధికారయుత ప్రీతిగా మారేయి! ఆ కుర్రాడి కష్టాలకి ఛెల్కాష్ విచారించేడు; ఆ పిల్లవాడు తనకాప్తుడు కావాలనుకున్నాడు. స్మృతి తప్పుతూన్న ఆ పడుచువాణ్ణి మెల్లగా జబ్బలక్రింద చేతులేసి పట్టుకుని, వెనకనుంచి నెట్టుతూ ముంగిట్లోకి తీసికొనివచ్చి, అక్కడున్న కట్టెలగుట్ట నీడని పరుండబెట్టేడు. తానూ ప్రక్కనే కూర్చుని పైపుతీసి వెలిగించి, ఏదో ఆలోచిస్తూన్నాడు, ఛెల్కాష్. గవ్రిలా గొణుగుతూ కొంచెం కదలి గాఢనిద్రలో మునిగిపోయేడు.

## 2

చీకట్లో తెడ్లు అమర్చుతూన్న గవ్రిలాతో బహు మెల్లగా అన్నాడు, ఛెల్కాష్;

"సిద్ధంగావున్నావా? బైలుదేరుదం!"

"ఆఁ! ఇదుగో! ఒక్క నిముషం. గాబిడీకొంచెం కదులు తూంది. తెడ్డుతో ఓ దెబ్బ వెయ్యనా?"

"ఒద్దు, ఒద్దు! చిటుక్కు మనకూడదు. చేతులతోనే బలంకొద్దీ నొక్కు, అదే దిగుతుంది."

ఇద్దరూ నిశ్శబ్దంగా పడవను సిద్ధం చేసి, కట్టుత్రాడు వదులు చేసేరు. అదంతా పడవలు, ఓడలు, తెప్పలు, ఫెలు క్కాలు,-రకరకాల జలయానసాధనాలతో నిండిపోయి వుంది. హార్బరునిండా, పడవలనిండా యెక్కడ చూసినా ఆలివ్ నూని, మంచిగంధం చెక్కలు, సైప్రసు బాదులు, రత్నకంబళ్లు, సిల్కు మజ్లిన్‌లు ఒకటేమిటి? రకరకాల అమూల్య సామ గ్రులు కొన్ని యెగుమతి కావలసినవి, మరికొన్ని దిగుమతి కావలసినవి, చిందరవందరగా వున్నాయి.

రాత్రి చిమ్మచీకటి. మేఘశకలాలు పొరలు పొరలుగా ఆకాశంలో ప్రయాణం చేస్తూన్నాయి. సముద్రం శాంతంగా, గంభీరంగా, నల్లగా, చిక్కటి తైలంలా వుంది. అనురాగార్ద్రి ముగా, లవణసౌరభంతో చిఱుతరగలు పడవల్నీ, గట్లనూ ప్రేమగా స్పృశిస్తూ, మెల్లగా విరిగిపడుతూన్నాయి. ఛెల్కాష్ పడవ జాయిగా తూగుటుయ్యాలలా వూగుతూంది. పెద్దఓడలు తీరానికి దూరంగా లంగరువేసి వున్నాయి. వాటి యెత్తైన తెర చాప కొయ్యలు ఆకాశంలోకి పొడుచుకుని, రంగురంగుల దీపాలతో తారల్ని కన్ను గిలుపుతూన్నాయి. వివిధవర్ణదీపా వళి నీటిలో ప్రతిఫలిస్తూ, వణుకుతూ పసిమిరంగు కాంతి తోర

జాల్ని కనులపండుగుగా కడుతూంది. నల్లని, నున్నని సముద్ర జలాల స్నిగ్ధహృదయం మీద యీ దీపకళికలు ముత్యాల హారంలా అందంగా జారుతూన్నాయి. సముద్రం దినమంతా పనిచేసి అలసి గాఢనిద్ర పోతూన్నట్లుంది.

"వెళ్ళిపోతూన్నాం!" అన్నాడు గవ్రిలా నీళ్ళలో తెడ్లని దించుతూ.

"ఊఁ!" అంటూ చెల్కాష్ చురుకైన మెలపుతో చుక్కాని తెడ్డు తిప్పి, రెండు పడవల మధ్య నేర్పడిన సన్నటి నీటిపాయలోకి పడవని పట్టించేడు. స్నిగ్ధజలాలమీద అతిలాఘవంగా పడవ దూసుకుపోతూంటే, తెడ్ల క్రింది నీరు నీలిగా భాస్వరకాంతులతో వెల్తుతూంది. పడవ పోయిన దారినే చుక్కానిక్రింద యీ భాస్వరపు నీలికాంతిపీలిక వణుకుతూ వెడల్పైన చాలు గీస్తూంది.

"ఏం తల యెల్లావుంది? దిమ్ముగా వుందా?" మార్దవంగా అడిగేడు చెల్కాష్.

"మా చెడ్డ బాధగావుంది. సమ్మెటతో కొట్టినట్లే వుంది. నీళ్ళతో తడుపుతే తగ్గుతుందేమో చూస్తా!"

"అబ్బే, యెందుకూ? అదేం లాభంలేదు. అంతకంటె కడుపు కాస్త చల్లబరుచుకో. అన్ని బాధలూ వదిలిపోతాయి!" అంటూ గవ్రిలాకి సీసా అందిచ్చేడు.

"ఆహాఁ! దేవుడు నీమీద దయచూపాలి!"

అస్పష్టంగా గడగడమని ధ్వని వినిపించింది.

"ఏం! బాగుందా? చాల్లే, యింకచాలు!" అంటూ షెల్కాష్ ఆపి, సీసా తీసుకున్నాడు.

పడవమళ్ళీ బైలుదేరింది. నిశ్శబ్దంగా, లాఘవంగా పడవల మధ్యనుంచి మలుపు తిరుగుతూ చేపలా పోతూంది. కొంచెం సేపట్లో వాళ్ళు పడవల వ్యూహంలోంచి బైటపడి బాహాటంగావున్న సముద్రాని కభిముఖంగా నిలబడ్డారు. కనుచూపు మేరలో గంభీరంగా, విశాలంగా సముద్రం వ్యాపించివుంది. దూరంలో పర్వతాల్లాగ మేఘమాలికలు నీళ్ళల్లోంచి లేచి వస్తూన్నాయి. పసుపురంగు నురుగుటంచుల నీలమేఘాలు కొన్ని, సముద్రజలానికివలెనే హరితవర్ణమేఘాలు కొన్ని, నిరుత్సాహజనకమైన నీడల్ని బరపుతూ, బరువుగా కదిలే ధూమ్రవర్ణమేఘాలు మరికొన్ని,—ఒకదాని వెనక మరొకటి పాకివస్తూ, ఒండొంటి వర్ణరూపాల్ని కలబోసుకుని, కరిగి, నూతనవర్ణాల్నీ రూపాల్నీ ధరిస్తూ, గంభీరంగా లేస్తూన్నాయి. నిర్జీవములైన యీ అనంతమేఘమాలికల్ని యే విధియొక్క అదృశ్యహస్తం నిర్దేశిస్తూందో? సముద్రపుటంచుల దూరాల్లో యీ పుష్కలావర్తకమేఘాలు అంతూదరీ లేకండా గుట్టలు పడివుండి మెల్ల మెల్లగా దిగంతాలవరకూ క్రమ్మివేసి, ఆకాశకన్య తన కోటి కోట్ల బంగరు కండ్లతో నిద్రాముద్రిత జలనాధుని చూడనీకండా అడ్డుపెడుతూన్నాయా? అనిపిస్తూంది. ఆకాశకన్య బంగారు నేత్రాల్లోని తేటకాంతుల్ని చూస్తూంటే మోడువారిన హృదయాలు చిగిర్చి, మాసిన ఆశలు రేకెత్తుతాయి!

"అద్భుతంగా, అందంగా వుంది, ఏం? సముద్రం బాగా లేదూ?" అనడిగేడు, ముగ్ధుడై చూస్తూన్న ఛెల్కాష్.

"బాగానే వుంది! కాని నాకేమిటో భయం వేస్తూంది." అన్నాడు గ్రవిలా తెడ్లేస్తూనే. వేగంగా లయతప్పకుండా పడే తెడ్డుదెబ్బలక్రింద నీరు బుడగలు లేస్తూ, చెదురుతూ, వెచ్చటి నీలిరంగు భాస్వరపుకాంతితో మెరుస్తూంది.

"భయం వేస్తూందీ? ఓరి దౌర్భాగ్యుడా!" ఉపాలంభనగా సణిగేడు ఛెల్కాష్.

అతడో గజదొంగ! సముద్రమంటే ఆతని కెంతో యిష్టం. ఉద్రేకపూరితమై, తీవ్రమై పొంగి పొర్లే ఆతనిస్వభావం అనంతమై, గంభీరమై, స్వేచ్ఛాచారమై వున్న ఆ గాఢాంధకారాన్నీ, విశాలసముద్రాన్నీ చూస్తూన్నకొద్దీ యింకా చూడాలనుకుంటుందే కాని తృప్తి జెందదు! తాను ప్రేమించే యీ ప్రకృతి సౌందర్యాన్ని గూర్చి యిలాటి జవాబు వినడాని కాతని మనసు నొచ్చింది. చుక్కానిలో కూర్చుని తెడ్డుతో నీటిని పాయలుజేస్తూ యీ స్నిగ్ధజలాలమీద దిగంతం వరకూ అంతులేని ప్రయాణం సాగించాలనే ఆశతో మూనంగా చూస్తూన్నాడు ఛెల్కాష్.

విశాలసముద్రం మీద వున్నపుడెప్పుడూ అతనిమనస్సు అనిర్వచనీయమై ప్రేమార్ద్రమైన విశాలభావంతో నిండిపోయి, దైనందిన క్షుద్రసంకుచితజీవితపు మురికి ప్రక్షాళితమై, పవిత్ర భావాలతో నిండిపోయిాది. ఆ దినాన్ని, ఆ భావాన్ని ఆత

డెంతో గొప్పగా యెంచీవాడు. ఈ విశాలోదక నిర్మల వాయు మధ్యమందు తన మనస్సుకూడా పవిత్రవంతమైన భావాలతో నిండిందనేదే షెల్కాష్‌కి యెంతో తృప్తినిచ్చేది! ఆ సమయంలో, ప్రదేశంలో జీవితపు తాపత్రయాలు బాధించవు. అసలు జీవితమే తనవిలువల్నీ, హద్దుల్నీ, కొలబద్దల్నీ కోల్పోతుంది! రాత్రిల్లు సముద్రం శాంతగంభీరంగా, నిద్రాముద్రితుడైన ఆరోగ్యవంతుని హృదయంలా మెల్లగా పడుతూ లేస్తూంటుంది; కెరటాల స్నిగ్ధోచ్ఛ్వాసనిశ్వాసాల మృదుధ్వని ఆ వాతావరణమంతటా వ్యాపించి మైమరపు కలిగిస్తుంది. ఆద్యంతములు లేని యీ గంభీరనాదం మానవుని మెదడును ప్రశాంతపరచి, కుత్సితపు తలపుల్ని నాశం చేసి, పవిత్ర మధురస్వప్నాల్ని చిగురింపజేస్తుంది.

"మనం వల ఒగ్గే దెక్కడ? వల యేదీ?" అని హఠాత్తుగా అడుగుతూ పడవలోకి అనుమానిస్తూ చూసేడు, గవ్రిలా.

షెల్కాష్ ఉలిక్కిపడ్డాడు. మధురస్వప్నం భగ్నమైంది.

"వలా? చుక్కానిలో వుంది."

"అదెల్లాంటిది? ఏదీ చూడనియ్యి!" గవ్రిలా రెట్టించేడు. ఈ కుర్రవానిదగ్గర అబద్ధం ఆడడం షెల్కాష్‌కి సిగ్గుచేటనిపించింది. అదే సమయంలో అతని ఆలోచనలన్నీ చెదిరిపోయినందువల్లబాధా కోపమూ కలిగింది. గుండెల్నీ గొంతునూ ఆర్చి, మండించే ఒక కఠోరభావం షెల్కాష్‌ను ఆవహించింది. కటువుగానూ, కోపంగానూ గవ్రిలాను గద్దిస్తూ,—

"కూర్చున్నవాడివి నోరుమూసుకుని కూర్చో! తెలిసిందా? ఇదే చెప్పడం. నీ కక్కర్లేని విషయాల్లో కలుగజేసుకున్నావా మాటదక్కదు. తెడ్డువెయ్యడానికి నిన్ను కూలికి తెస్తే పాలికి మాట్లాడుతూన్నావే? నాలుక సంబాళించుకోకపోతే నీకేదో మూడిందన్నమాటే. ఏం?"

గవ్రిలా కూర్చున్న చోటనే గతుక్కుమన్నాడు. తెడ్లు నీళ్ళలో నిలిచిపోయి, బుడగలు తెప్పిస్తూన్నాయి. పడవ ఒక్కసారి అదిరి క్షణమాత్రం నిలబడిపోయింది.

"తెడ్డేయడానికా? దాని...!"

నిశ్శబ్దాన్ని భంగంజేస్తూ గవ్రిలా ప్రశ్నా, బూతుమాటా ప్రతిధ్వనించేయి. సంబాళించుకొని మళ్ళీ తెడ్డు వేస్తూన్నాడు, గవ్రిలా. విసురుగా, పెద్దపెద్ద ఊపులతో నీటిని గలగలమని పాయచేస్తూ పడవ సాగిపోతూంది.

"నిదానంగా వెయ్యి!"

అంటూ ఛెల్కాష్ చుక్కానిలో లేచినిల్చుని తీవ్రంగా గవ్రిలావైపు చూసేడు. గవ్రిలాముఖం వెలవెలబోయింది. భయంతో అతనికి ముచ్చెమటలూ బట్టినాయి. ఎరమీద దూకడానికి సిద్ధంగావున్న పిల్లిలా ఒడుపేసివున్న ఛెల్కాష్ విగ్రహం చీకట్లో నీడలా కనిపిస్తూంది. పళ్ళు పటపట కొరుకుతూన్న ధ్వని, ఉద్రేకంలో కదిలేటప్పుడు ఎముకలు మెటికలు విరుగుతూన్న ధ్వనీ ఆ నిశ్శబ్దంలో బిగ్గరగా వినిపించేయి.

దూరంగా సముద్రంలోంచి ఖంగున మ్రోగింది ఓ మొరటు కంఠం:

"ఎవరక్కడ ?"

షెల్కాష్ నాలుక పళ్లకి తాటించి బుసకొట్టినట్లు మెల్లగా కసిగా అన్నాడు:

"తెడ్లు వేగంగా వెయ్యరా, పిశాచపుపీనుగా ! చప్పుడు కానీయకు, కుక్కా ! ఊఁ! చంపేస్తాను, వెధవా ! ఒకటి. రెండు... మూడు...కిక్కురుమన్నావా పీక పిసికేస్తా!"

తెడ్లు వేగంగానే పడుతున్నాయి. కాని గవ్రిలా భయం తోనూ, ఉద్రేకముతోనూ వణికిపోతూ నోట్లోనే గొణుకుతున్నాడు:

"అమ్మా ! పవిత్రకన్యా ! ఈశ్వరమాతా ! తల్లీ ! "

పడవ గిరుక్కున మళ్లి, చల్లగా హార్బరులోకి వెళ్లిపోతూంది. రంగు రంగుదీపాలగుత్తులతో కాంతిగావున్న తెరచాప కొయ్యలు అడివిలా దగ్గరలోనే కనుపిస్తూన్నాయి.

నీళ్లమీదనుంచి మళ్లీ కేక తేలివచ్చింది.

"ఎవరక్కడ !"

ఈ సారిధ్వని మరీదూరంగా వినిపించింది. షెల్కాష్ కుదట బడ్డాడు. ఆ కేక వినవచ్చినవైపు తిరిగి పరిహాసంగా,

"నువ్వేరా, భాయి !" అన్నాడు, శాంతంగా.

గవ్రిలావైపు చూసేసరి కాతడింకా ప్రార్థనవాక్యాల్ని గొణుగుతూనేవున్నాడు.

"అదృష్టవంతుడివి గనకే బ్రతికిపోయేవు! ఆ వెధవలు గనుక మనల్ని కనిపెట్టేరంటే నీ పని ఆఖరయ్యేదే! రెప్పపాటు

లోనిన్ను నీళ్లల్లోకి విసిరేసేవాణ్ణి! చేపలీపాటికి నిన్ను ఫలహారం చేసేవే!"

ఛెల్కాష్ స్వరంలో కోపంగాని, దుడుకుగాని లేదు. శాంతంగా, సరదాగా, మామూలుగా మాట్లాడుతూన్నట్టే వుంది. కాని గ్రవిలామాత్రం గడగడా వణుకుతూ బ్రతిమాల నారంభించేడు.

"బాబ్బాబు! నన్ను పోనియ్యి! దైవసాక్షి! నన్ను వదిలెయ్యి. మా అమ్మకి నేనొక్కణ్ణే! ఎక్కడో అక్కడ గట్టున దింపెయ్యి, పోతా. అయ్యయ్యో! నాశనం ఐపోయేను. పరలోకాన్ని గూర్చి ఐనా నన్ను పోనీ! నాకు నీతో సంబంధమేమిటి? ఈలాటి పని నేను చేయను! నా కలవాటు లేదు. ఎరక్కపోయి ఒప్పుకున్నా! అయ్యో! దేవుడా! నాపని ఐపోయింది. మాయ వాడు! నన్నేలా యిరికించేడో, యీ పాపపుపనిలో! ఆలోచించు, కనికరించు, మా బాబువిగాదు! నీ కడుపున పుడతా! ఇంకోడి ఆత్మనికూడా నాశనం చెయ్యకు! ఈ పాపపుపనులతో! అయ్యయ్యో?"

"ఏం పాపపు పనులురా? అఁ హాఁ? ఏమిటి? యేం పనులు?" కసిగా, పళ్లుబిగించి ఛెల్కాష్ అడిగేడు.

అతనికా రైతుయువకుడి భీతిచూస్తే కుతూహలం, ఆనందం కలిగింది. తాను, - ఛెల్కాష్ గజదొంగ! తనంటే యెవడికేనా సింహస్వప్నం! ఈ ఆలోచనలో ఛెల్కాష్‌కి తృప్తి కలిగింది.

రైతుమాత్రం యేడుస్తూ, బ్రతిమాల నారంభించేడు.

"నేస్తమా! నన్ను పోనియ్యి! దేవుడితోడు! ఇల్లాటి పనులు నేనెరగను! నేను నీకేం అపకారంచేసేను? మా బాబువు కదూ? నీ...!"

"నోరుముయ్యి! ఊఁ! నీతో పనిలేకపోతే నిన్నెందుకు తీసుకొస్తానురా? తెలివితక్కువ పెద్దమ్మా! తెలిసిందా? యింక చాలించు. నోరుముయ్యి!"

"అయ్యో! దేవుడా!" అని నిట్టూర్చి, దిగాలుపడిపోయేడు గవ్రిలా.

"లే, లే! పని చూచుకో!" అంటూ గవ్రిలాని మందలిస్తూ తొందరచేసేడు ఛెల్కాష్.

గవ్రిలాకి చాలైపోయింది. బిగపట్టి అణిచివుంచిన దుఃఖం ఒక్కసారిగా పొంగి పొర్లింది. వెక్కి వెక్కి యేడుస్తూ, చీది పోస్తూ, కూర్చున్న చోటే గిలగిల కొట్టుమిట్టాడి పోతున్నా తెడ్లు మాత్రం వేగంగానే లాగుతున్నాడు. పడవ బాణంలా పోతూంది. ఎత్తైన కాటుక కొండల్లాంటి ఓడలు దారిలో అడ్డు వస్తాంటే తప్పుకుంటూ, వాటిమధ్యనున్న సన్నటి నీటి పాయల్లోంచి బొంగరంలా తిరుగుతూ పడవ కనుమరుగైపోయింది.

ఒక్కమాటుండి సలహా పూర్వకంగా చెల్కాష్,-

"ఇదిగో! విన్నావా? ఎవడేనా నిన్నేమడిగినా సరే, మాట్లాడకు. నోరు విప్పేవంటే చచ్చేవనుకో! బతకాలనుకుంటే నోరువిప్పకు. తెలిసిందా?" అన్నాడు.

"అయ్యో! అయ్యో! చచ్చేనురా దేవుడా!" అనుకుంటూ గవ్రిలా నిట్టూర్చేడు. ఈ నిష్ఠుర సలహాకు అతని మనస్సు చచ్చిపోయింది.

"ఊరిఖే యేడవకు! బుడిబుడి యేడ్పులూ నువ్వూ!" అని మళ్లీ బహుమెల్లగా గుసగుసగానే ఆజ్ఞాస్వరంతో ఛెల్కాష్ గద్దించేడు.

దీనితో గవ్రిలా చైతన్యం, గ్రహణశక్తి వచ్చినాయి. ఏదో పాణప్రమాదం విరుచుకు పడేటప్పుడు ఆశ వదులుకున్న వానిలా నిశ్చైతన్యంగా, నిర్జీవంగా వుంది గవ్రిలా వైఖరి. యాంత్రికంగా తెడ్లని నీటిలో దించుతూ, వెనక్కిలాగి తేల్చి పైకెత్తుతూ మళ్ళీదించుతూన్నాడు. శూన్యదృష్టితో యెదురుగా తన్ని పట్టిన తనకాళ్ళవైపే చూస్తూన్నాయాతనికళ్ళు. 'జాగ్రత!' అని బెదిరిస్తూన్నట్లుగా కెరటాలు పడవప్రక్కల్ని తట్టుతూ తటతట శబ్దంచేస్తూన్నాయి. వార్ఫు సమీపించింది. నల్లరాతిగోడమీద మనుష్యుల మాటసడి వినిపిస్తూంది. కెరటాలు విరిగిన ధ్వనీ, పాటలూ, ఈలలూ,— అన్నీకలసి చల్లనిగాలిలో మెల్లగా తేలియాడుతూ వినవస్తూన్నాయి.

"ఆగు!" ఛెల్కాష్ రహస్యంగా అన్నాడు. ఎత్తైన వార్ఫుగోడ సమీపించింది.

"తెడ్లువెయ్యకు! గోడను చేతులతో పట్టుకొని మెల్లగా వెంటు! చప్పుడు చేసేవంటే, జాగ్రత!"

పాకుడుపట్టి జారుతూన్న రాళ్ళని పట్టుకుంటే గవ్రిలా చేతులు జివ్వుమన్నాయి. నిశ్శబ్దంగా పడవను గోడవెంబడే తోస్తూన్నాడు.

"ఆగు! తెడ్లిల్లాయియ్యి. నాచేతికందించు. నీ పాస్‌పోర్టు యెక్కడుంది? సంచిలోనేనా? సంచి యియ్యి! రా, త్వరగా అందియ్యి! ఎందుకో తెలుసా! చిట్టినాన్న పరిగెత్తిపోకుండాను! పాస్ నాదగ్గరుంటే నువ్వెక్కడికీ పారిపోలేవు! తెడ్లు లేకున్నా పారిపోగలవు గాని పాస్ లేకుండా వెళ్ళడానికి నీగుండె తాళదు. ఇక్కడే వుండు. కాని గుర్తుంచుకో! తొంగిచూసేవంటే,– నిన్ని నీళ్ళలో పాతేస్తా!"

ఛెల్కాష్ రెప్పపాటులో యిన్ని ప్రశ్నలూ, ఆజ్ఞలూ, బెదరింపులూ విసురుతూనే తెడ్లు, గవ్రిలా సంచి చేతబట్టుకుని, యే రాతినో పట్టుకు వ్రేలాడి, గాలిలో లేచి, హార్బరుగోడ మీదుగా చీకట్లో మాయమైపోయేడు.

చెప్పడం యింతసేపు పట్టింది గాని యిదంతా రెప్ప పాటులో జరిగిపోయింది. మంచు కురిసినప్పుడు లేతమొక్కలా గవ్రిలా వణికిపోయేడు. ఆ మీసాలపోతు, బికారి, గజ దొంగ ఛెల్కాష్ ఎదుటవున్నప్పుడు తన్ను అణచిపెట్టివుంచిన భయం, పాడుభారం వాడితోబాటే తొలిగిపోయినట్లనిపించింది. స్వేచ్ఛగా ఊపిరివిడిచి, ఒక్కసారి అంతటా కలియచూసేడు. ఎడమవైపున ఓ పెద్దఓడ నల్లగా శవపేటికలా, పర్వతంలా లేచి వుంది. దానిమీద మనుష్యుల అలికిడే లేదు. కెరటాలా ఓడ

ప్రక్కల్ని తాకుతూ తటుకుతటుకు మని గుల్లగా చప్పుడు చేస్తున్నాయి.

కుడివైపున హార్బరుగోడ చెమ్మగా పాకుడుపట్టి నల్లగా జిడ్డోడుతూ వంకరలుతిరిగి పొడుగ్గా పెద్ద కొండచిలువలా వ్యాపించివుంది. వెనుకవైపుచూస్తే ఏదో గుర్తించరాని నల్లని స్వరూపాలు ఆకాశంలోకి పొడుచుకునివున్నాయి. ముందు మాత్రం గోడకీ శవపేటికకీ మయంగా చూస్తే సముద్రం నిశ్శబ్దంగా, మరుభూమిలా వ్యాపించివుంది. సముద్రంమీద తుపాను మేఘాలు భారంగా, మెల్లగా, భయావహంగా కదులుతూ, చూసేవాళ్ళ హృదయాల్లో దిగులు పుట్టిస్తున్నాయి. ఎటు చూసినా నల్లగా, భయంకరంగా పీడకలలావుంది.

గవ్రిలా మనస్సు భయంతో కంపించింది. చెల్కాష్‌వల్ల కలిగినభయంకంటె యీ పంచభూతసంరంభం చూస్తే కలిగిన భీతి వెయ్యిరెట్లుగా అతన్ని క్రుంగదీసేది. మంచుగడ్డలా చల్లగా, కాల్చిన యినపశలాకలా తీక్ష్ణంగా గవ్రిలా హృదయంలోకి చొచ్చుకుపోయి, అతని నోక మట్టిముద్దగా నిర్జీవంగా చేసివేసి, అక్కడే మేకు బందీచేసి బిగించేసింది యీభీతి. కాలం స్థంభించినట్లుంది.

చుట్టుప్రక్కలంతా నిశ్శబ్దం ఆవరించి వుంది. సముద్రపు నిట్టూర్పులు తక్క వేరు సవ్వడిలేదు. ఆకాశంలో మేఘాలు యథాపూర్వంగానే మృత్యుచ్ఛాయల్లా అలముకుంటున్నాయి. క్రిందనున్న స్నిగ్ధగంభీరజలాలమీద ఆవరించివున్న రెండో

ఆకాశంలాగ మేఘమండలం ఘూర్ణిల్లుతూంది. ఉంగరాలు చుట్టుకున్న తెల్లని శిఖరాలతో కెరటాలులాగ విరిగి విరుచుకు పడుతూన్నాయి, మేఘాలు.

భయావహమైన యీ ప్రశాంతత, యీ నిసర్గసౌందర్యం గవ్రిలా మనస్సులో భీతిని కలిగించేయి. యజమాని త్వరగా తిరిగివస్తే బాగుండు ననుకున్నాడు. ఒక వేళ ఆతడు రాకపోతే? అనుకుని గవ్రిలా కంపించిపోయేడు. కాలం స్తంభించి పోయిందా? ఆకాశం మీద మెల్లగా నడవడంలో పోటీ చేస్తూన్న మేఘాలకంటెనూ మెల్లగా నడుస్తూంది, కాలం! ఒక్కొక్క క్షణం జరిగినకొద్దీ యీ ప్రశాంతత మరీ భయంకర మనిపిస్తూంది. హార్బరుగోడమీద సవ్వడీ, నీరు చిందిన ధ్వనీ, గుసగుసగా మాటలూ వినిపించేయి. గవ్రిలా రక్తం గడ్డ కట్టింది; ప్రాణం యెగిరిపోయినట్లే అనిపించింది.

"ఏయ్! నిద్దరా? పట్టుకో! జాగ్రత!" అంటూ ఛెల్కాష్ మెల్లగా పిలిచేడు.

హార్బరు గోడమీదనుంచి పెట్టెలాటి దేదో బరువుగా క్రిందికి జారింది. గవ్రిలా దాన్నందుకుని పడవలో పెట్టేడు. మళ్లీ అటువంటిదే యింకొకటికూడా అందుకున్నాడు. ఛెల్కాష్ దీర్ఘశరీరం గోడమీద కనిపించింది ; తెడ్లుకూడా వచ్చేయి. గవ్రిలా చేతిసంచీ దబుక్కున అతని కాళ్లముందు పడింది. బరువుగా ఊపిరితీస్తూ ఛెల్కాష్ పడవలో కురికి, చుక్కానిలో చతికిల పడ్డాడు.

గవ్రిలా పిరికిగా చూస్తూ, సంతోషం ముఖంమీద తాండవిస్తూంటే చిరునవ్వుతూ అడిగేడు :

"దమ్ము వచ్చిందా?"

"దమ్మురాదూ, మరి. నీపడుచుతనం యిప్పుడు చూపించాలి! రా. నీచేవ చూస్తానుగా ! నీకు మంచికూలే గిడుతుంది లేరా! నేస్తం! ఇప్పటికి సగంపని తీరింది. ఇంకా సగం వుంది. ఈ పిశాచాల కన్నుబ్రామి తప్పించుకు పోయేమా! నువ్వు నీ డబ్బు తీసుకోవచ్చు, నీ మాష్కా దగ్గిరికి పోవచ్చును. నీమాష్కా యెల్లావుంటుందిరా? చెప్పు? ఏం? పాపం చంటోడివి! సిగ్గా?"

"లేదూ!" అని సాగదీస్తూ గవ్రిలా అతివేగంగా తెడ్డేస్తూన్నాడు. ఆ పడుచువాడి గుండెలు కొలిమితిత్తుల్లా ఊపిరి వదులుతూన్నాయి. నరాలు పెనవేసిన ఉక్కుతీగెల్లా సాగుతూన్నాయి. నీరు పడవక్రిందనుంచి గలగల్లాడుతూ పొంగుతూ వెనక్కి పోతూంది. చుక్కాని వెనక నీలికాంతిచాలు యిప్పుడింకా వెడల్పుగా వుంది. గవ్రిలా శరీరమంతా చెమటతో తడిసిపోయింది. అతడు రాక్షసబలంతో తెడ్లు లాగుతూన్నాడు. ఒక్కరాత్రిలో అప్పుడే రెండుసారు ప్రమాదపరిస్థితుల నెదుర్కోవలసి వచ్చింది. మళ్ళీ మూడోసారి ఆ సాహసానికి గవ్రిలా గుండె తాళడం లేదు. అతనిలో సర్వాత్మనా ఒకటే కోరిక తీవ్రంగావుంది. దీన్నితగలెయ్యా యీపని యెల్లాగో అయిందనిపించుకుని, గండం గడచి గట్టెక్కాలి. ఈ గజదొంగ తన్ను

నిజంగా చంపెయ్యడమో, జైల్లోకి లాగడమో చేయకముందే వీడినుంచి దూరంగా పరుగెత్తిపోవాలి. వీడితో యింకేమీ మాట్లాడకూడదనీ, వాడిమాటకి అడ్డు చెప్పకూడదనీ, వాడు చెప్పినదానికల్లా తలూపి, విధేయతచూపాలనీ, దేవుడిదయవల్ల వీడిగుప్పిట్లోంచి బైటపడి బ్రతికి బట్టకడితే ఘటనాఘటనసమర్థుడైన నికోలాయ్‌ఋషికి దీపారాధనా, వందనసమర్పణమూ చేయించుతాననీ మ్రొక్కుకున్నాడు. ప్రార్థనావాక్యాలతని నాలుకమీదికి త్రోసుకు వస్తూన్నాయి. అతికష్టంమీద సంబాళించుకుని ముంగిలా బుసలుకొడుతూ కనుబొమలక్రింద నుంచి ఛెల్కాష్‌ని చూస్తూ హీనంగానే తెడ్లు లాగుతూన్నాడు.

ఛెల్కాష్ యెగరడానికి సంసిద్ధంగా వున్న గ్రద్దలా ముందుకు లేచి, వంగి కొనదేలిన ముక్కు నటునిటు త్రిప్పుతూ, వాడిచూపులతో చీకట్లని చీల్చుతూ, ఓ చేత్తో మీసం మెలి త్రిప్పుతూ, రెండోచేత చుక్కాని కాస్తూన్నాడు. సన్నని పెదవులమీద నాట్యంచేస్తూన్న చిరునవ్వుకి అతని మీసం కదులుతూంది. ఛెల్కాష్‌కి తన కార్యం సఫలమవడంమీద, తనమీద, యీ పడుచువాడిమీదా కూడా యెంతో తృప్తిగావుంది. ఈ కుర్రాడు తనంటే హడలిపోతూ, పరమవిధేయుడై, బానిసలాగ అయేడు! వాడెంత కష్టపడి పనిచేస్తున్నాడో! ఛెల్కాష్‌కి జాలి కలిగి గవ్రిలాని సంతోషపెట్టాలనీ, హెచ్చరికగా వుండేటట్లు చెయ్యాలనీ కోరికకలిగింది. ముఖం వికృతంగా యికిలించి, మృదువుగా పలకరించేడు.

"నీకు భయం వేసిందనుకుంటా, ఏం? హడలి బేజారై పోయేవు!"

గవ్రిలా కంఠం సవరించుకుని, నిట్టూరుస్తూ,

"అబ్బే! లేదు!" అన్నాడు.

"అప్పుడంత విసురుగా తెడ్డేయడం యెందుకూ? ఆ యాసం తీర్చుకో. ఇంకొక్క గండం దాటాలి. మెల్లిగా తెడ్డేయి! విశ్రాంతిగా !"

గవ్రిలా వినయంగా పని నిలిపి, ముఖంమీది చెమటను చొక్కాచేత్తో తుడుచుకున్నాడు. ఒక్కనిముషం వుండి తెడ్లని మళ్ళీ నీటిలో దించేడు.

"మెల్లిగా! నీరు త్రెళ్ళకూడదు! చప్పుడు కానీయకు. హార్బరు ముఖద్వారంలోంచి పోవాలి మనం! మెల్లిగా! నిశ్శబ్దం! ఇక్కడి కాపలావాళ్లు దేవాంతకులు, ఆవలిస్తే పేగులు లెక్క పెడతారు! నేస్తం! బహుజాగ్రత! వాళ్ళు ఏ క్షణంలోనైనా మనల్ని కనిపెట్టి కాల్చవచ్చు! వాళ్ళసంగతి తెలుసా? దెబ్బ కొట్టేరూ అంటే కిక్కురుమనవు! అంతే!"

పడవ నిశ్శబ్దంగా చేపలా నీటిమీద పాకిపోతూంది. తెడ్లు పైకి లేచినపుడు నల్లటినీటిబొట్లు సముద్రంలోపడి క్షణ కాలం నీలికాంతుల్ని విరజిమ్మి మాయమవుతూన్నాయి. నిశీథం యింకా నల్లగానూ, నీరవంగానూ వినట్లుంది. ఆకాశంలోని అల్లకల్లోలంతగ్గి, మేఘాలంతటా వ్యాపించి నీటిపైన బరువుగా, స్నిగ్ధంగా, నిశ్చలంగా మడతలుగా చాందినీ కట్టినట్లున్నాయి.

సముద్రం మరింత నల్లగా, ప్రశాంతంగా వుంది. నీటిమీదనుంచి నులివెచ్చగా, ఉప్పువాసన యింకా ఘాటుగా కొడుతూంది.

"వర్షం రాకూడదూ! చినుకుల చాటునుంచి కాపలా వాళ్ళ కంటబడకుండా యిట్టే తప్పించుకుపోవచ్చు!" అన్నాడు గుసగుసగా ఛెల్కాష్.

వీళ్ళకి అటూ యిటూ కూడా నీటిమీద నిటారుగా లేచి కొండల్లా నిశ్చలంగా, నీడల్లా నల్లగా నిలబడివున్నాయి ఎన్నో ఓడలు, పెద్దపడవలు. వాటిల్లో ఒకదానిమీద యెవరో లాంతరు దీపంతో అటునిటు పచారుచేస్తున్నారు. కెరటాలు బ్రతిమాలుతూన్నట్లు పడవలపాదాల్ని స్పృశిస్తూ, ముద్దుపెట్టుకుంటున్న ధ్వని గుల్లగా వస్తూంది; మేము వినేదిలేదని పడవలు తిరస్కరిస్తూన్నట్లు ప్రతిధ్వని కఠినంగా యెదురొస్తూంది.

"తీరరక్షకులు!" ఛెల్కాష్ ఊపిరిబిగబట్టి అన్నాడు.

తనను మెల్లగా తెడ్డేయ మన్నప్పటినుంచీ గ్రవిలాలో ఆతురత హెచ్చింది. కటికచీకట్లోకి వంగిచూస్తూంటే తానొక రాక్షసుడిలా పెరిగినట్లనిపించింది. అతని యెముకలు, నరాలు బాధతో మొద్దుబారేయి; మెదడు దిమ్మెక్కిపోయింది; వీపు తిమ్మిరిగా వున్నట్లుంది; కాళ్ళల్లో పదునైన చల్లని సూదులు గ్రుచ్చుతూన్నట్లుచురుక్కుమంటూంది. చీకట్లోంచి హఠాత్తుగా యెవరోలేచి "నిల్చోండి! దొంగలు!" అని అరుస్తారని అనుక్షణం ఆశిస్తూ చీకట్లోకి కళ్ళుపొడుచుకు చూస్తూండడంవల్ల బాధగా సలుపుతూన్నాయి.

"తీరరక్షకులు!" అని మళ్ళీ షెల్కాష్ మెల్లగా అన్న పుడు గవ్రిలా ఉద్వేగంతో వణికిపోయేడు. తీవ్రమై శరీరాన్నం తనూ దహించే ఒకేఒక కోరిక అతని మనస్సులో తళుక్కుమని మెరిసింది. ఆతురతతో బిగిసివున్న గవ్రిలా నరాలు ఒక్కమాటు సడలి, శరీరమంతా పులకరించింది. బిగ్గరగా అరవాలనీ అందర్నీ తనకి సాయంచేయరమ్మని పిలవాలనీ గాఢమైన కోరిక అణచ రానిదై అతని నావహించింది. కూర్చున్నచోటే సగంలేచి, నోరు తెరిచేడు; ఊపిరితో గుండెలు నింపుకుని కేకేసే యత్నంలో వుండగానే యేదో హఠాత్తుగా నెత్తిమొత్తినట్లై, కళ్ళు చీకట్లు గమ్మి వెర్రిమూలుగుతో దొర్లిపడిపోయేడు, గవ్రిలా.

దూరంగా దిఙ్మండలంమీద రాత్రిచీకట్లని చీల్చు కుంటూ భయంకరమైన దేవతాఖడ్గం నల్లటిసముద్రజలాల్లోంచి హఠాత్తుగా లేచి, మేఘాల్లోంచి దూసుకుపోయిఆకాశంలోయింకి పోయింది. దాని దారంతా కాంతితోనిండి, అంతవరకూ మంచు తెరలో చుట్టబడి, చీకటిమసిలో మునిగి అదృశ్యంగావున్న ఓడలూ, పడవలూ నల్లగా మూగదయ్యాల్లా కనబడుతూ న్నాయి. తుపానులవల్ల చిరకాలం సముద్రగర్భంలో మునిగి వుండి మళ్ళీ బాహ్యప్రపంచాన్ని చూసే కాంక్షతో తపించి పోయి యిప్పుడీ ఆగ్నేయఖడ్గప్రభావంవల్ల పైకి లాగబడిన ట్లున్నా యీ ఓడలు! ఓడకొయ్యలకి చుట్టబెట్టిన త్రాళ్ళూ, తెర చాపలూ వీటితోబాటు సముద్రగర్భాన్నుంచి వచ్చిన తెల్లులా వున్నాయి. ఈ కాంతిఖడ్గం కొంచెంసేపట్లో మళ్ళీ ఆకాశంవైపు

లేచింది; మరికొంతసేపట్లో యింకోదిక్కుగా ప్రసరించింది. దాని కాంతి పడినచోట్ల అంతవరకూ చీకట్లో అదృశ్యంగావున్న వివిధ జలయానాల రూపాలు బైటపడుతూన్నాయి.

ఏం చెయ్యడానికీ తోచక నిలబడినట్టుగా ఛెల్కాష్ పడవ ఆగి, నీటిమీద అటునిటు ఊగులాడింది. గవ్రిలాపడవలో పడుకుని చేతులతో ముఖం కప్పుకున్నాడు. ఛెల్కాష్ బూటు కాలితో అతణ్ణి పొడిచి లేపుతూ, మృదువుగాను కోపంగానూ,—

"అదే కస్టమ్సు ఓడరా! మూర్ఖుడా! ఆ కాంతి సెర్చి లైటుది! లే! బుద్ధిలేనివాడా! వాళ్ళేక్షణంలోనేనా దీపాన్ని మన మీదికి త్రిప్పవచ్చు! నువ్వేగాకుండా నన్నూ నాశనం చేస్తావురా, పిశాచపుపీనుగా! లేరా!" అన్నాడు, మెల్లిగానే.

చివరకి ఛెల్కాష్ బూటుమడమ వీపుమీద గట్టిగా పడినపుడుగాని గవ్రిలా లేవనేలేదు. భయంతో కళ్ళు మూసుకునే తడిమి తెడ్లు అందుకు కూర్చుని లాగనారంభించేడు.

"మెల్లిగా! నీకుగాదూ చెప్తూంట! చంపేస్తా! నిన్నేరా! మెల్లిగా! వెధవా! నిన్ను తగులబెట్టా! భయం దేనికిరా? ఒరేయ్! పందిమొహం! అది లాంతరేరా! దయ్యమేంకాదు లే. తెడ్లు మెల్లిగా వెయ్యరా పిరికిపీనుగా! దొంగసరుకులు తెచ్చే పడవలకోసం వెతుకుతూన్నార్రా వాళ్ళు! మనం దొరకంలే. ఆ వెధవలు దూరంగా పోతున్నారులే! భయపడకు, మన్ని పట్టుకోలేరులే! ఇహ ఫర్వాలేదు! మనం దొరకం, యింక!..."

ప్రమాదం దాటిపోతూన్నకొద్దీ చెల్కాష్ స్వరంలో బెదిరింపుతగ్గి, మాటలో మార్దవం వస్తూంది. చివరకి ప్రమాదం తొలిగించవనే ధీమా కలిగింది. విజయగర్వంతో దిక్కులు పరికించి చూస్తూన్నాడు చెల్కాష్.

"ఐపోయిందిలే! ఆ వెధవలకా మనం దొరకడం! ఒరేయ్, చవటా! నీకు గుండెల్లేవురా! మనం అదృష్టవంతులం! లేచినవేళ మంచిది!"

అతని మాటలు హెచ్చరికగా వస్తూన్నాయి. కాని గవ్రిలా మాత్రం మౌనంగానే కూర్చుని తెడ్లు లాగుతూ సెర్చి లైటుకాంతి యెక్కడ పడుతూందా? అనే చూస్తూన్నాడు. భయంతోటీ, శ్రమతోటీ అతను బాగా అలిసిపోయి, ఊపిరి గట్టిగా పీలుస్తూన్నాడు. ఆ కాంతి ఒక దీపానిదే అని చెల్కాష్ చెప్పినమాటలు గవ్రిలా కేవలం నమ్మలేకపోతూన్నాడు. నల్లటి నీలికాంతి చీకట్లని చీలుస్తూ సముద్రజలాల్ని తెల్లగా మెరిసేటట్లు చేస్తూంటే దానిలో యేదో అనిర్వచనీయమైన అపశకున చిహ్నాన్ని చూస్తూ భయంతో వివశుడైపోయేడు, గవ్రిలా. యాంత్రికంగా తెడ్లు లాగుతూ, పైనుంచి దెబ్బ మీాద పడేటప్పుడు ముడిచిపెట్టుకునే పిల్లవానిలా కూర్చునివున్నాడు. అతని బుద్ధి పనిచేయడంలేదు. ఇప్పుడాతడు శూన్యమనస్కుడు, చైతన్యరహితుడు! ఆ కాళరాత్రియందలి భావోద్రేకా లాతని చైతన్యాన్ని పురుగు నాకేశాయి!

కాని, మళ్ళీ యీ తూరికూడా ఛెల్కాష్‌దే విజయం. బొద్దుగా పెరిగి, మెలికలు తిరిగిన ఆతని మీసాల్లో శీపీ, కళ్ళలో ఆతురతా ప్రస్ఫుటమవుతూన్నాయి. లోకం ఆ క్షణంలో ఆతడి కెంతో బాగా వుందనిపించింది. సన్నగా యీలేస్తూ, తేమగా వున్న సముద్రపుగాలిని గుండెలనిండుగా పీలుస్తూ, ఆత్మతృప్తిగా తనవైపు చూచుకుంటూన్న ఛెల్కాష్ గవ్రిలాను చూసి ఆదరపూర్వకంగా చిరునవ్వేడు.

సముద్రంలో చిఱుతరంగాల్ని లేపుతూ గాలి వీచింది. మేఘా లెంతో అందంగానూ, గాజులా పారదర్శకంగానూ వున్నాయి. ఆకాశం యింకా మేఘచ్ఛన్నంగానే వుంది. గాలి వీస్తూన్నా మేఘాలుమాత్రం కదలడంలేదు. ఏదో స్వప్నంలో మునిగి తన్మయత్వం బొందినట్లు నిశ్చలంగా ఆకాశంలో వ్రేలాడుతూన్నాయి.

"ఒరేయ్! కుర్రాడా! మనసు కుదుటబడిందా? అబ్బా! ఎంతాలస్యం ఐంది! నేస్తం! ఇదేమిటి! ఇల్లావున్నావేమిటి? ప్రాణమే లేనట్లు, ఊపిరిపోయి ఉత్తిబొంది మిగిలినట్లు వున్నావేం? ఇప్పుడేం భయం లేదులే! అదంతా ఐపోయిందిరా! ఒరేయ్!"

ఛెల్కాష్‌దే కానియ్యండి, మనుష్యస్వరం వినడానికి గవ్రిలా ప్రాణం సుఖంగావుంది.

"వింటున్నా!" అన్నాడు మృదువుగా.

"ఐతే లేరా! నేస్తం! రా! నువ్వు చుక్కానిలో కూర్చో. నేను తెడ్లు లాగుతా. పాపం! అలిసిపోయివుంటావు!"

గ్రవిలా యంత్రంలాగే కదిలేడు. స్థలం మారుతూ ఛెల్కాష్ అతని ముఖంలోకి చూసేడు. కాళ్ళు వణుకుతూ, తూలుతూ వెడుతూన్న ఆకుర్రవాణ్ణి చూచినప్పుడు ఛెల్కాష్‌కి మరీ జాలిగలిగింది. గ్రవిలా భుజంమీద తట్టుతూ,-

"రారా! కుర్రాడా! భయపడకు! నీకష్టం ఫలించిందిలే. నేస్తం! నీకు కావలసినంతా యిస్తానులే. ఏం? ఇరవైఐదు రూబుల్సు చాలునా?"

"నాకేం అక్ఖర్లేదు. మళ్ళీ గట్టెక్కితే అంతేచాలు!"

ఛెల్కాష్ తూష్ణీభావంతో చెయివిసిరి, కూర్చుని తెడ్లు లాగుతూ కాండ్రించి ఉమ్మేశాడు. అతడు పొడుగాటి చేతులు విసిరినప్పుడల్లా తెడ్లు యెంతో వెనక్కి వెడుతున్నాయి.

సముద్రం మేల్కొంచినట్లుంది. నురుగులు వారుతూన్న అంచులతో తరంగాలు లేస్తూ, ఒకదానిమీదొకటి విరుచుకు పడుతూ సన్నటి తుంపురులుగా చెదరిపోతూన్నాయి. ఈ తుషారాన్ని పిల్లగాలులు దూరంగా మోసుకుపోతూన్నాయి. సముద్రం నురుగులు కడుతూ, బుసలు కొడుతూ, నిట్టూరుస్తూంది. కెరటాలు విరిగి లేస్తూన్న హోరుతో వాతావరణమంతా నిండివుంది. ప్రకృతి ఆ ప్రాతఃకాలంలో మేల్కొంచినట్లుంది. ఛెల్కాష్ హుషారుగా సంభాషణ ప్రారంభించేడు.

"ఏరా, అబ్బాయి! చెప్పరా! నువ్వు మీవూరు వెడతావు, పెళ్ళి చేసుకుంటావు; వ్యవసాయం ప్రారంభిస్తావు. పొలందున్ని విత్తులు చల్లుతావు. నీభార్య బిడ్డల్ని కంటుంది.

మంద యెక్కువైతే మజ్జిగ పల్చనకదా? ఇంట్లో యే వస్తువా సమృద్ధిగా వుండదు. జీవయాత్ర అతికష్టంమీద నడుస్తూం టుంది. అంతేనా? ఏమంటావ్? అల్లాటి జీవితంలో ఏం రుచి వుందో!"

"జీవితంలో రుచా? అబ్బే! సంసారం ఏమంత మధు రంగా వుండదు." అన్నాడు గవ్రిలా వణుకుతూనే, పిరికిగా.

గాలికి మేఘమండలంలో అక్కడక్కడ చిరుగులు పడు తూన్నాయి. ఈ చిరుగుల్లోంచి ఆకాశపు నీలిమ ఒకటి రెండు నక్షత్రనేత్రాలతో మినుకు మినుకుమని తొంగి చూస్తూంది. చెలగాటాలాడుతూన్న కెరటాల్లో యీ నక్షత్రాలు ప్రతిఫలిస్తూ మాయమవుతూన్నాయి.

"దరికి కాయి! వచ్చేశాం! కొంచెంసేపట్లో మనం అక్కడ వుంటాము. పని యేదో పూర్తైంది. కష్టం ఫలించిందిలే. ఇదుగో! ఇల్లాచూడు! ఒక్కరాత్రిలో ఐదువందల రూబుళ్ళు సంపాదించేను! ఏం? మంచి మొత్తం కాదూ?" అన్నాడు, ఛెల్కాష్.

"అయిదు వందలా?" సాగదీసుకుంటూ గవ్రిలా ఆశ్చ ర్యంగా అడిగేడు. అతనికి నమ్మకం కలగలేదు. కాని వెంటనే భయమూ కలిగింది, ఛెల్కాష్‌కి యెదురు చెప్పడానికి. అనిశ్చిత భావంతో బేలును కాలుతో పొడుస్తూ అడిగేడు:

"ఏం సరుకేమిటి?"

"అబ్బో! అది చాలా ఖరీదైందిలే! అసలుధర కమ్మితే

వేయింటికి పైగానే వస్తుంది. కాని నేను చౌకగానే అమ్మతా. అది మంచిపద్ధతి కదూ?"

"ఔను!" సందేహిస్తూనే గవ్రిలా దీర్ఘంతీసేడు.

ఒక్క-క్షణం నిశ్శబ్దం. నిట్టూరుస్తూ, నిశ్శబ్దాన్ని భంగిం చేడు, గవ్రిలా.

"అదంతా నాకు వుంటేనా!"

అతని కళ్ళముందర తన గ్రామం, నిస్సారమైన పొలం, బీదసంసారం, ముసిలితల్లి, తన కెంతో దవ్వునవున్నా అత్యంత సన్నిహితంగానే వున్న వన్నీ గిరున తిరిగినట్లైనాయి. తాను అంతదూరం పనిసంపాదించబోయిందీ, ఆ రాత్రి ప్రమాదంలో పడిందీ తన కుటుంబం నిలబెట్టుకోడానికేగాదూ? గ్రామంలోని సంఘటనలెన్నో అతనికి జ్ఞాపకం వచ్చేయి. తను పుట్టిన ఆ పల్లె టూరు యెంతబాగుంటుంది! ఓ ప్రక్క- పర్వతాలూ, అరణ్యం; రెండో ప్రక్క- నదిలోకి వాలుగా వున్న ప్రదేశం. భూర్జ, అర్జున, సాలాది మహావృక్షాలతో మేఘమండలాన్ని స్పృశించే పర్వత సానువుల్లోని అరణ్యం తమకు కల్పవృక్షంలావుండేది. పంటలకి నీటినీ, తిండికి రకరకాల చేపల్నీ యిచ్చే నది రైతులికి కామధేనువు! తన గ్రామం తలంపుకు రాడంతోటే నిట్టూర్చేడు మళ్ళీ.

"అయ్యో! అదెంత బాగుంటుంది!" ఆ సౌకర్యం తన బోటి దరిద్రుడికి అందనిమాని పండనే నిర్వేదంతో, బాధతో నిండివుం దాతని స్వరం. షెల్కాష్ హృదయం వాత్సల్యతతో నిండింది.

"నీ కేమీ లోటు రాదులే. మీ యింటికి రెక్కలమీద యెగిరిపోతావు; మీ వూరి పడుచులు నీ కోసం యెగబడతారు! నీకు నచ్చినదాన్ని యేరుకుందువుగాని. కొంపా గోడీ కట్టుకుంటావు. ఏం? కాని యీ డబ్బు యిల్లుకట్టడానికి సరిపడదనుకుంటా."

"ఔను! సరిపోదు. దీంతో యిల్లే మవుతుంది? అందులోనూ మా ప్రాంతంలో కలప చాలా ప్రియం!"

"సరే, పోనీలే! పాతకొంపే మరామతు చేసుకుంటావు. గుర్రం సంగతేమిటి? నీకు గుర్రం వుందా?"

"గుర్రమా? వుంది. కాని వెధవది ముసిలిదీ! ఎందుకది?"

"సరే. ఐతే ఓ గుర్రం కొనాల్సిందే! మంచి గుర్రాన్నే కొనుక్కొందువుగాని. ఓ ఆవు, గొర్రెలు, కోళ్ళు, బాతులు, అన్నీ. ఏం?"

"ఏమిటో! ఆలూ లేదు చూలూ లేదు! నాకామాత్రమా? అయ్యో! దేముడా! అదే నిజమైతేనా!"

"నేస్తం! నీకేం లోటురాదులే! అటువంటివాట్లని గూర్చి నాకూ తెలుసు. ఒకప్పుడు నేనూ అన్ని భోగాలూ అనుభవించేను. ఆ రోజుల్లో మావూళ్ళోకల్లా స్థితిమంతుడు నాతండ్రి!"

ఛెల్కాష్ తెడ్డుదెబ్బలు లయతో మెల్లగా పడుతూంటే పడవ ఒయ్యారంగా నాట్యం చేస్తూనడుస్తూంది. గాలికి చిరుతరంగాలు చెలగాటాలాడుతూ పడవలోకి అంచులమీంచి దూకుతూన్నాయి. సముద్రం కేరింతలు కొడుతూన్న చిన్న

పిల్లవానిలావుంది. పడవ నడుస్తూందా అని అనుమానం కలిగే టంత మెల్లగా పోతూంది. పడవతోబాటు ఉయ్యాల లూగుతూన్న ఆ యిద్దరూ ఎవరి ఆలోచనల్లో వారు మునిగి, సాలోచనగా చుట్టూ చూస్తూన్నారు. సంభాషణను గవ్రిలా స్వగ్రామం మీదికి త్రిప్పడంలో చెల్కాష్ వుద్దేశ్యం అతన్ని వుత్సాహపరచి, సంతోషపరుద్దామని. మొదట్లో అయిష్టంగా, చేదుమందు తాగేవాడిలా మొహంపెట్టి మాట్లాడిన చెల్కాష్, రైతుయువకుని మాటలకి వుత్సాహంగా జవాబిస్తూన్నాడు. అతని కంఠంలో మార్పు, తన్మయత్వం ప్రస్ఫుట మవుతూన్నాయి. గ్రామీణజీవితపు సుఖసంతోషాల్నిగూర్చి ఉపన్యాస ధోరణిలో పడ్డాడు. ఏ జీవితంమీద విసుగెత్తి, ధిక్కారంతో పెడముఖంపెట్టి తొలగిపోయేడో ఆ జీవితాన్నీ, ఆ జీవితపు మోహజాలాల్నీ మీరజాలక విమోహితుడైపోయి చెల్కాష్ పల్లెటి రైతుజీవితాన్ని గూర్చి తానే వుపన్యసిస్తూన్నాడు:

"నేస్తం! అన్ని మాటలు దేనిగ్గాని రైతుల జీవితంలో కల్లా చెప్పుకోతగ్గది స్వేచ్ఛ. నీకు నువ్వే అధికారివి! నీకు స్వంత కొంప,–అది దమ్మిడీ కిమ్మత్తుచేయనిదే కానీ,–వుంది. స్వంత పొలం.– దొప్పెడే చాలు,– దానిమీద నువ్వే రాజువి! నీ భూమ్మీద నీమాటే శాసనం! నీ పరివారానికి నువ్వే నాయకుడవు! నిన్నంతా గౌరవిస్తారు, నీ హక్కును మన్నిస్తారు, ఏం? ఏమంటావు?"

ఈ ధోరణికి గవ్రిలా విస్తుపోయి చూస్తూ వింటూన్నాడు. క్రమంగా ఆతనికికూడా బెదురుతీరి ఆసక్తితో సంభా

షణాలోకి దిగేడు. ఈ సందడిలో తానెవరితో మాట్లాడుతూ న్నాడో మరిచే పోయేడు! వీడుకూడా తనంటి రైతే! వాడికీ పొలం పుట్రతో సంబంధాలున్నాయి! తరతరాల రైతుజీవితం, ఓడ్చిన చెమట, చేసిన కష్టం, పల్లెటి అనుభవాలు, స్మృతులు,- యివన్నీ అతన్ని యినపసంకెళ్ళకంటే దృఢంగా బంధించే వుంచి నాయి! ఆ జీవితాన్నుంచి బుద్ధిపూర్వకంగా వేరుపడి, నిర్లక్ష్యం చేసి, సిరి రా మోకాలొడ్డినట్లు చేసేడు. అందుకు ప్రతిఫలా న్నిప్పుడు అనుభవిస్తూన్నాడు! అల్లాటి ఛెల్కాష్ తనకెంత సన్నిహితుడు! పాడై పోయిన యీ మాజీ రైతు సోదరుడికి హితవు గరపడం తన విధికాదూ?

"నిజం భాయీ! నువ్వు చెప్పింది పరమసత్యం! నీ స్వానుభవమే అందుకు దాఖలా! భూమిని వదలి వచ్చి నువ్వేల్లా ఐపోయేవో నీకు మాత్రం తెలియదూ? భూదేవి తల్లిలాంటి దనుకో! తల్లిని మరచీ, భూమిని విడచీ యెవ డుండగలడు?"

ఈ మాటలు సూటిగా ఛెల్కాష్ హృదయానికి తాకేయి. గుండెల్ని కాల్చేమంటతో ఆతడు స్వాప్నికజగత్తు నుంచి మేల్కొన్నాడు. రైతుల సంకుచిత జీవితం మీద విసు గెత్తి, తెగించి అన్నిటినీ వదలి పెట్టిన సాహసాన్నీ, నిర్లక్ష్య స్వభావాన్నీ యెవరైనా వేలెత్తి చూపిస్తే - అందులోనూ కొరగానివాడని తానెంచుకున్న వాడే ఆ పని చేస్తే యెవరికి ఒళ్లుమండదు? గద్దిస్తూ, మొరటుగా అన్నాడు:

"ఓరి చవటా! నోరు పెగిలిందే? నే నన్నది నిజంగానే అనుకున్నావు గాదూ ? ఆఁహాఁ! నోరు ముయ్యి యీపాటికి!"

"అన్నా! నేన్నది నిన్నుగూర్చికాదు! కోపం చెయ్యకు! పాపం! ప్రపంచంలో అల్లాంటి దురదృష్టవంతు లెందరో వున్నారు. అంతవరకూ యెందుకు? బికారీలు......" గవ్రిలా సానునయంగా భయంతో సమర్థించుకో జూస్తున్నాడు.

"దున్నపోతా! తెడ్లు తీసుకో!" అని క్లుప్తంగా ఛెల్కాష్ ఆజ్ఞాపించేడు. లోపలినుంచి తోసుకుంటూ వస్తూన్న బూతుల పరంపరను ఆపుకోనేసరికి అతనికెంతో బ్రహ్మాండమై పోయింది.

ఇద్దరూ స్థలాలు మారడానికి లేచేరు. మధ్యలో తారసిల్లినపుడు గవ్రిలాని ఒక్క తన్నుతో సముద్రంలోకి త్రోసెయ్యాలని ఛెల్కాష్‌కి తీవ్రమైన కాంక్ష ఆవేశించింది.

సంభాషణ అర్థాంతరంగా నిలిచి పోయింది. కాని యిప్పుడు గవ్రిలా మౌనమే పల్లెటి జీవితాన్ని గూర్చి ఘోషిస్తూన్నట్లుంది ఛెల్కాష్‌కి. గత జీవితపు స్మృతిలో మునిగి ఛెల్కాష్ చుక్కాని త్రిప్ప మరిచేడు. ప్రవాహంలో చిక్కుకుని పడవ దూరానికి పోతూంది. పడవ దారి తప్పిందని కెరటాలు గ్రహించేయేమో దాని తెడ్లక్రింద నీలికాంతుల్ని వెదజల్లి పైపై కెగరేసి ఆడుతున్నాయి. ఛెల్కాష్ కళ్ళముందర పదకొండు సంవత్సరాల క్రిందటి పాతజీవితం గిర్రున తిరిగి పోయింది. ద్రిమ్మరిగా, బికారిగా, పరదేశిగా యిప్పటి తన జీవితం, సంపన్నరైతుగా, సంప్రదాయబద్ధుడైన కుటుంబిగా,

గృహస్థుగా గడపిన తన పూర్వజీవితం,- ఎంత భేదం! తను పుట్టిన వూరు, శైశవం, బాల్యస్నేహితులు; దయవుట్టే పడే తెల్లనికళ్ళు, యెర్రటి చెక్కిళ్ళు, సౌజన్యపూరితమైన మాటలతో,- ప్రేమమూర్తియైన తల్లి; యెర్రటి జుంజురుగడ్డం, నిష్ఠుర ముఖవర్చస్సు, బలిష్ఠుడై చెయ్యెత్తున వుండే తండ్రి; నిర్విచార బాల్యజీవితం, యౌవన ప్రాదుర్భావం, వివాహ గోష్ఠి, వధూనిశ్చయం; నల్లటి కళ్ళు, పొడుగాటి తలకట్టు, మృదువై, మాంసలములైనఅవయవాలుగల్గియౌవనపొంకంతో మిసమిసలాడే తనభార్య అన్ఫీసాతో కాపురం; సైన్యంలోకి బోవలసి రావడం; అప్పటితన ఠీవి, దర్పం; పటాలంలోంచి తిరిగి వచ్చినప్పుడు గ్రామస్తులు యిచ్చిన స్వాగతం; వృద్ధులైన తలిదండ్రులు; కష్టాలతో వంగిపోయి, తల నెరసి, గడ్డం పండిన తండ్రి విగ్రహం; శరీరమంతా ముడుదలుపడి, నేలకు వంగిపోయిన తల్లిరూపం కళ్ళకి కట్టినట్టే కనిపించేయి. గ్రామంలోకల్లా ఆజానుబాహుడూ, బలిష్ఠుడూ, సాహసీ ఐన సిపాయిగా వున్న కుమారుడు గ్రిగరీని చూసి తండ్రి పొందిన గర్వభావం యెల్లామరచిపోగలడు, తాను? గత జీవితస్మృతి అసుఖులుగా వున్నవాళ్ళ హృదయాల్ని కాల్చేస్తుంది; అది పురాతన శిలలను కూడ సజీవంగాచేసి మాట్లాడిస్తుంది; ఎప్పుడో త్రాగిన విషపాత్రలో మధుబిందుస్యందనం చేయగలదు!

తనయింటిలోని ప్రీతిపూర్వకవాతావరణం, తల్లి అమృత వాక్కులు, తండ్రి అధికార వాత్సల్య పూరితస్వరం, భార్య

చూపే ప్రేమ, చనవు; విస్మృతిపథానబడ్డ మెన్నో కంఠాలు; గ్రామీణ ధ్వనులు, సందడి; ఋతుప్రారంభంలో మంచు కురిసి నప్పుడూ, యేరువాక తోలినపుడూ పొలాలమీది సువాస నలూ, కొత్తచేలతో పచ్చని తివాచీ పరిచినట్లూ, పండిన చేలతో బంగారు మేలిముసుగు ధరించినట్లూ నిత్య నూతన ఆకర్షణలతో భూదేవి; యివన్నీ గుర్తుకొచ్చి, జ్ఞానేంద్రియాలన్నీ యీ అనుభూతితో 'తృప్తాస్మః' అన్నాయి! తనలో ప్రవహించే కవోష్ణరక్తం యెక్కడిది? ఆ పల్లెటి జీవితం ప్రసాదించినదే గాదా? అట్టి జీవితవిధానాన్నుంచి పెరికివైచిన నిష్ఠురవిధి తనను యెటో విసరివేసింది! తానిప్పు డేకాకి, దారితప్పిన పాంథుడు, దయనీయుడు, విధివంచితుడు! ఈ భావంతో ఆతని హృదయం నిండి, క్రుంగిపోయేడు.

"హోయ్! దారి తప్పేం! ఎక్కడికి పోతున్నాం?" అని గవ్రిలా హఠాత్తుగా కేకేయడంతో ఉలిక్కిపడి లేచి చెల్కాష్ చుట్టూ పరీక్షగా గ్రద్దలా చూసేడు.

"ఆఁ! మన పడవకి దయ్యం పట్టిందిరా! ఫర్వాలేదు లే. కొంచెం విసురుగా తెడ్డేయి. నిముషంలో అక్కడికి చేరుతాం."

"నువ్వు కలలు గంటున్నావు?" గవ్రిలా చిరునవ్వుతూ అడిగేడు.

"చాలా అలిసిపోయేను." అన్నాడు చెల్కాష్.

"మనం దీనితోబాటు దొరికిపోముగదా?" అంటూ గవ్రిలా బేలును కాలితో తన్నేడు.

"అబ్బే! ఏం భయంలేదు. నిశ్చింతగా వుండు. సరుకు యిచ్చేసి సరాసరిగా డబ్బు తెస్తా. ఏం? సరా?"

"ఐదు వందలా?"

"అంతకి గవ్వ తగ్గదు. గ్యారంటీగా చెప్పగల!"

"ఎంత డబ్బు! నాకే గనక అంత మొత్తం వుంటేనా! నా జీవితం ఎంత సుఖవంతంగా వుంటుంది! అయ్యో! దౌర్భాగ్యుణ్ణి!"

"మీ వూళ్ళోనే వుంటావా, అప్పుడు?"

"తప్పకుండా! నేను వెళ్ళి......ఎందుకూ?...."

గవ్రిలా దివాస్వప్నాల్లో మునిగి తేలుతూన్నాడు. ఛెల్కాష్ మౌనంగా కూర్చుని చుక్కాని కాస్తూన్నాడు. అతని మీసాలు అపరిష్కృతంగా క్రిందికివాలిపోయి వున్నాయి; కుడిప్రక్కంతా నీటి తుంపురులతో తడిసి ముద్దైపోయింది; కళ్ళు గుంటలుబట్టి, కాంతి తరిగి వున్నాయి; వేటాడే గ్రద్దవైఖరంతా యెటో బోయి, అవమానితుడై ఆలోచనలో మునిగినవానిలా వున్నాడు. తడిసి ముడుదలుపడిన మురికి చొక్కాయే ఛెల్కాష్ దీనత్వాన్ని చాటుతూంది.

నీళ్ళలో నల్లగా పైకి లేచివుం దొక స్థాణుస్వరూపం. పడవ గిరుక్కున తిరిగి, వేగంగా దానివైపే పోతూందిప్పుడు.

ఆకాశమంతా మళ్ళీ మేఘావృతమైంది. వెచ్చని సన్నచినుకులు టపటపమని కెరటాలమీదా, వాళ్ళ పడవ మీదా దట్టంగా పడుతూన్నాయి.

"మెల్లిగా! జాయిగా వెయ్!" ఛెల్కాష్ ఆజ్ఞాస్వరంతో అన్నాడు.

అంతలో పడవ ముక్కు వెళ్ళి మరో ఓడకి తగిలి లేచింది. ఇద్దరూ ఒక్కసారి అదిరిపడి సంబాళించుకున్నారు.

"పిశాచాలు! నిద్దరోతూన్నారేమిటి చెప్మా!" అని ఛెల్కాష్ గొణుగుతూ కొంకి కర్రతో ఓడమీదనుంచి వ్రేలాడే పగ్గాల్ని పట్టుకుని దరికి తీసేడు.

"ఏయ్! ఎవరు పైన? నిచ్చెన దింపండి! ఈ వర్షం ఒకటీ, దిక్కుమాలింది! ఇాదాకాటినుంచీ యెక్కడికి పోయిందో? ఏయ్! జలగలు! పిశాచాలు! ఒరేయ్! నిచ్చెనరా!"

"ఎవరది? సెల్కాసా?" అని యెవరో ఓడమీదినుంచి కిచకిచలాడేరు.

'రారా! నిచ్చెన దింపు!"

"ఒరేయ్! కలిమెరా! సెల్కాస్!"

"నిచ్చెన దింపరా, ఎందుదెయ్యం?" కోపంతో అరిచేడు ఛెల్కాష్.

"దింపుతూన్నా! ఈ వేళ యింత కోపంగా వున్నావేం?"

"లేరా, గ్రవిలా!" అన్నాడు ఛెల్కాష్ నేస్తంతో.

మరుక్షణంలో యిద్దరూ ఓడమీా దున్నారు. డెక్కుమీాద ముగ్గురు దాడీవాలాలు విదేశీయాసతో కిచకిచలాడుతూ యేదో చర్చించుకుంటూ, ఛెల్కాష్ పడవలోకి తొంగి చూసేరు. పొడుగాటి అంగీ ధరించిన మరొకడు ఛెల్కాష్‌ను

సమీపించి, మాటామంతీ లేకండానే అతని చేతిని పట్టుకుని చాలనచేస్తూ గవ్రిలా వైపు అనుమానంగా చూసేడు.

"డబ్బు సిద్ధంగావుంచు తెల్లారేసరికి!" ముక్తసరిగా చెప్పేసి ఛెల్కాష్ గవ్రిలావైపు తిరిగేడు.

"ఇప్పుడింక నిద్రపోవాలి! రా, గవ్రిలా? పోదాం! నీకు ఆకలేస్తూందా?"

"నిద్దరొస్తూంది!"

ఇంకో ఐదు నిముషాల్లో గవ్రిలా ఓడలోపల మురికి చెక్కలమీదే పడుక్కుని గుర్రుపడుతూన్నాడు. అతని ప్రక్కనే కూర్చున్న ఛెల్కాష్ యెవరిబూట్లో కాళ్ళకి యెక్కించడానికి తంటాలు పడుతూన్నాడు. నిద్దుర ఆపుకోలేక ప్రక్కకి తిరిగి ఉమ్మేసి, పళ్ళసందునుంచి యీలపాట ప్రారంభించేడు. ఆపాట కూడా విచారకరంగానే వుంది. కొంచెం సేపట్లో ఛెల్కాష్ యీలపాట నిలిపి, గవ్రిలా ప్రక్కనే ఓచేయి తలగడగా చేసుకుని మీసం మెల్లిద్దిప్పుతూ పడుకున్నాడు.

చెలగాటాలాడే కెరటాలమీద ఓడ ఉయ్యాలలూగుతూంది. ఎక్కడో కొయ్యలు కోపంతో కిర్రుమంటున్నాయి. వానచినుకులు మెల్లిగా డెక్కుమీద చిటపట తాళం వేస్తూన్నాయి. కెరటాలు ఓడప్రక్కల్ని గుల్లగా తట్టి విరిగిపడుతూన్నాయి. ప్రకృతే శోకగీతాన్ని ఆలాపిస్తుందా? అన్నట్లుంది. కుమారుని జీవితమందాశ వదలిన తల్లి యేడుస్తూ పాడే జోలపాటలా వుందది!

చెల్కాష్ నోరు తెరిచి తలెత్తి చుట్టూ చూసి, ఏదో గొణుక్కుని మళ్ళీ పడుక్కున్నాడు......కాళ్ళు యెడంగా పెట్టి పండుకున్న చెల్కాష్ ఆ మసక చీకట్లో ఓ పెద్ద కత్తిరి లాగా వున్నాడు.

## 3

మళ్ళీ మేలుకోడానికి చెల్కాషే మొదటివాడు. చుట్టూ ఆతురతగా కలయజూచి, నిద్రలో ములిగివున్న గవ్రిలాని చిరాకుగా తేరిపార చూసేడు. అంతలోనే ఆత్మసంయమనం చేసుకుని, సంబాళించుకున్నాడు. గవ్రిలా మృదువుగా చంటి పిల్లవానిలా గురక పెడుతూన్నాడు. ఆరోగ్యంగా, పుష్టిగా, యెండకి కమిలిన రంగుగల గవ్రిలా ముఖంమీద చిరునవ్వు తొరగలిస్తూంది. నిట్టూరుస్తూ చెల్కాష్ లేచి త్రాటినిచ్చెన యెక్కి ఓడ కంత గుండా బైటికి చూచేడు. తూర్పు తెల్లవారింది. శిశిరాకాశం ధూమ్రవర్ణంగా సీసపు రేకులావుంది.

రెండు గంటల తర్వాత ముస్తాబై చెల్కాష్ తిరిగి వచ్చేడు. అతని ముఖం యెర్రబడింది. మీసం దర్జాగా మెలితిరిగి వుంది; దిట్టమైన యెత్తుబూట్లు, పిక్కలకి తోలుపట్టీలు, పంట్లాం లోపలికి దోపిన పొట్టిచొక్కా,- యీ వేషంలో అతడో క ఆటగాడులా వున్నాడు. దుస్తులంత శుభ్రంగా లేకున్నా ఆతడికి తగినట్లే మాంచి దిట్టంగా వున్నాయి. ఆ దుస్తుల్లో ఆత

డింకా మోటుగా, వెడల్పుగా మిలిటరీ సిపాయిలా కనిపి స్తూన్నాడు. వస్తూనే,—

"ఏహేయ్! గిత్తదూడ! లే! లే!" అంటూ గవ్రిలాను బూటుతో మెల్లిగా తన్నేడు. గవ్రిలా ఉలిక్కిపడి లేచి, చెల్కాష్‌ని గుర్తు పట్టలేక దిగాలుపడి భయంతో చూడ నారంభించేడు. చెల్కాష్ అట్టహాసం చేస్తూ,—

"మనం యిట్టే మారిపోతాం! కాని నువ్వు మాత్రం యిట్టే బెదరిపోతావు! ఐతే నా కిది చెప్పు. రాత్రి భయంతో నువ్వెన్నిసార్లు చచ్చిపోయేవురా? ఏమిటి?" చెల్కాష్ పరిహా సానికి గవ్రిలా ప్రాణం కుదుట పడింది.

"ఔననుకో! కాని నాకు అల్లాటి పనికదే మొదలు మరి! ఈ జన్మకి లేనేలేదు. మళ్ళీ జన్మకేనా వుండాలా? ఆత్మ నాశనం ఐతే పుట్టగతు లుండొద్దూ?"

"పోనీ గాని మళ్ళీ అల్లాంటి పనికి వస్తావా? చెప్పు?"

"మళ్ళీనా? అమ్మో! రాలేను! కాని ఎట్లా చెప్పగల నులే! దేనికోసం? అదీ సందర్భం!"

"దేనికోసమా? రెండు యింద్ర ధనస్సులకు!"

"రెండు వందల రూబుల్సుకా? అదేనా? ఆ పక్షంలో రాగల ననుకుంటా!"

"అప్పుడు నీ ఆత్మ ఏమౌతుందో? డబ్బు వస్తే..."

"ఆఁ! పోనిద్దూ! పరమార్థం డబ్బులోనే వుందన్నారు పెద్దలు! ఆత్మ చెడిపోయే వస్తువేం కాదులే!" అని చిరునవ్వేడు గవ్రిలా.

"చెడిపోక పోవచ్చును! పైగా డబ్బుంటేనే ఎవడి పౌరుష మేనా నిలబడేది! అది లేనివాళ్ళ ఆత్మలు అఘోరిస్తూన్నాయి!" చెల్కాష్ ఉల్లాసంగా నవ్వేసేడు.

"పోనిద్దూ! పరిహాసాలకేం గాని త్వరగా గట్టుకి పోదాం నడు!"

కొంచెంసేపట్లోనే యిద్దరూ పడవమీదికి వచ్చేరు. చెల్కాష్ చుక్కానిలోవుంటే, గవ్రిలా తెడ్లు పుచ్చుకున్నాడు. తెల్లని ఆకాశంమీద మబ్బులు పల్చగా వ్యాపించివున్నాయి. మాసిన పసరురంగు సముద్రం తీరసామీప్యాన్ని సూచిస్తూంది. కెరటాలు పరిహాసంగా చపేటాలు కొట్టుకుంటూ నీటిజల్లులాడు కుంటూన్నాయి. దూరంగా తీరం పసుపురంగుఅంచులా కనిపి స్తూంది. సముద్రంలో అలలు విశ్రుంఖలంగా అల్లకల్లోలం చేస్తూ న్నాయి. తెల్లని పూలమాలలు ధరించినట్లు నురుగులువారే అంచులతో తరంగపంక్తులు పందేలువేసి పరుగులు వారుతూంటే సముద్రం దున్నిన పొలంలా కానవస్తూంది. దూరదూరంగా సముద్రపు వక్షస్థలంమీద ఊగులాడే కొయ్యలు ఓడల ఉనికిని రూఢిపరుస్తున్నాయి. హార్బరులోని తెరచాపకొయ్యలు శిశిర ఋతువులోని అడివిని స్ఫురింపజేస్తూన్నాయి. దగ్గరలోనే పట్ట ణంలోని యిళ్లు తెల్లగా మిలమిల్లాడుతున్నాయి. పట్టణపు గుంజనధ్వని, సముద్రపుహోరుతో మేళవించి గీతాలు పాడు తూంటే ప్రాతఃకాలానికి మేలుకొలుపులావుంది. ఉషఃకన్య మేలి ముసుగులా తెల్లని పొగమంచు తెర అంతటా వ్యాపించి వస్తు

వుల్ని దూరదూరంగా వున్నట్లు తోపిస్తోంది. చెల్కాష్ యీ సౌందర్యాన్ని ముగ్ధుడై చూస్తూ, సముద్రంవైపు తల పంకించేడు:

"ఆఁ! సాయంత్రానికి భూతనాట్యంప్రారంభమౌతుంది!"

"తుపానా?" అన్నాడు గవ్రిలా. అతని తెడ్లు నీటిని దున్నేస్తూంటే సముద్రకెరటాలాతన్ని ఆపాదశిరఃపర్యంతమూ తుంపురుతో తడిపేస్తూ కసితీర్చుకుంటున్నాయి.

"ఔను! తుపానే!" తలూపేడు చెల్కాష్..

గవ్రిలా సవితర్కంగా చెల్కాష్‌వైపు చూస్తూన్నాడు.

"వాళ్లు నీకెంతయిచ్చేరు?" చెల్కాష్ యీ ప్రసంగం యెత్తేటట్లు లేడని కనిపెట్టి చివరకి వుండబట్టలేక అడిగేసేడు.

"చూడు! ఇదుగో!" అంటూ చెల్కాష్ పట్లాం జేబు లోంచి చిన్నకాగితాలదొంతి పైకిలాగి గవ్రిలావైపు జాపేడు.

నోట్ల దొంతరని చూస్తూంటే గవ్రిలా కళ్లయెదుట యింద్రధనస్సు తాండవమాడినట్లైంది.

"ఆహాఁ! నువ్వు వుత్తినే అంటున్నా వనుకున్నా! అదెం తుంటుంది?"

"ఐదువందల నలభై!"

"అబ్బా! ఎంత డబ్బో!" గొణుగుతూ ఆశాపూరిత నేత్రాలతో అటేచూస్తూన్నాడు గవ్రిలా. చెల్కాష్ నోట్లని జేబులోపెట్టేస్తూంటే దిగులుగా నిట్టూర్చి, నీరసంగా,—

"ఎంతడబ్బో! నేనెప్పుడూ చూళ్లేదు!" అన్నాడు.

"మనం యీవేళ 'ఖుషీ' చేద్దాం!" ఏమంటావు భాయీ! ఉత్సాహంగా వున్నాడు ఛెల్కాష్. గవ్రిలా వైఖరి చూసే సరికి ఆతనికి అనుమానం వేసింది.

"ఫర్వాలేదులే! మనకి సరిపడా వుంది. నువ్వేం సందేహించకు! నీకూ వాటా పెడతాకదూ? నల్భై చాలా? ఏం? కావాలంటే యిప్పుడే యిస్తా! యింద, తీసుకో!"

గవ్రిలా మాట్లాడనే లేదు. ఛెల్కాష్ బతిమలాడుతూన్నట్లు,-

"మొహమాట పడకు! ఏం? ఎంతకావాలో అడుగు! నీకు యేదీ లేదననులే!"

ఏం చేయడానికీ తోచక గవ్రిలా నిలువెల్లా వణికిపోతూన్నాడు. ఏదో భావమాతని మనస్సులో పీకుతూంది.

"హ్హా! హ్హా! హ్హా! నువ్వా? శనిగ్రహానివి గాదురా! ఎంత అడిగినా లేదనను. తీసుకోరా బాబూ తీసుకో! బతిమాలుతా నిన్ను. తీసుకో! ఇంద! నాకు మాత్రం అంత డబ్బెందుకు? ఏం చేసుకుంటానేమిటి? నాకు సాయంచెయ్యాలి నువ్వు, కొంత తీసుకో!"

ఛెల్కాష్ బతిమాలుతూ కొన్ని నోట్లను తీసి గవ్రిలా వైపు జాచేడు. తెడ్డు వదలి, వణికే చేతులతో నోట్లు తీసుకుని చొక్కాలోపలి జేబులో భద్రపరచుకుంటూంటే అతని కళ్ళు దురాశతో మెరుస్తూన్నాయి. వేడివేడిదేదో త్రాగుతూన్నట్లు నోటితో ధ్వనిచేస్తూ, ఊపిరి బిగ్గరగా తీస్తూన్న గవ్రిలాను చిరు

నవ్వుతో చూస్తూ కూర్చున్నాడు చెల్కాష్. ముఖం చేల్లక కళ్ళు దించేసుకునే తెడ్లను ఉద్రేకంగా లాగుతూన్న గవ్రిలా భుజాలు, చెవులువణుకుతూన్నాయి. చెల్కాష్ సాలోచనగా,-

"నీకు మా చెడ్డ ఆశ! అది చాలా పాడుగుణం. నాకేం ఆశ్చర్యం లేదు లే! ఇంతకీ నువ్వు రైతువికదూ?" అన్నాడు.

"ఔను కాని భాయీ! డబ్బుతోనేగదా ప్రపంచం నడి చేది!" అని గట్టిగా అరిచేడు గవ్రిలా. ఉన్నట్టుండి ఉద్రేకంగా తొందరపడుతూ నట్టుతూ గ్రామీణజీవితాన్ని గూర్చి చెప్పనారం భించేడు. ఆలోచనల్ని తరుముతూ, యెగిరేమాటల్ని పట్టుకుం టూన్నట్లుగావుందాతని వైఖరి. గౌరవం, సమృద్ధి, సంతోషం,- అన్నీ డబ్బున్న వాళ్ళకేగాని నిర్ధనులెందుకూ కొరగారుగదా!

చెల్కాష్ ముఖంలో ఆసక్తీ, కళ్ళలో స్వాప్నిక ఆలోచ నలూ కనిపిస్తూన్నాయి. శ్రద్ధగావింటూ అప్పుడప్పుడు తృప్తిని సూచించే చిరునవ్వు నవ్వుతూన్నాడు. తీరాన్ని సమీపించి నప్పుడు మాత్రం గవ్రిలా ధోరణికి అడ్డువచ్చి,-

"ఇదిగో! వచ్చేసేము!" అన్నాడు. ఓ కెరటం పడవను పట్టుకుని యెత్తి తీరంమీాది యిసుకలోకంటా లాక్కువచ్చి పడేసింది.

"లే! నేస్తం! మన ప్రయాణం ఆఖరైంది! కెరటాలికి మళ్ళీ కొట్టుకుపోకండా పడవని యింకా పైకిలాగేయాలి. పడవ వాళ్ళువచ్చి తీసుకుంటారు లే! సరే, యింక మనం విడిపోవాలి! పట్టణం ఐదుమైళ్ళుంటుంది. నువ్వేం చేస్తావు? నాతో పట్నానికి వస్తావా?"

ఛెల్కాష్ ముఖంలో సుస్వభావం, సంతోషం తాండ విస్తూన్నాయి. చిరునవ్వుతూ, యేదోసత్కార్యం సంకల్పించి, తన ఆప్తవర్గాన్ని ఆశ్చర్యానందాల్లో ముంచదలచిన వాడిలా వున్నాడు. చేతులు పంట్లాంజేబుల్లోకి పోనిచ్చి నోట్లను మడ మడలాడిస్తూన్నాడు. గవ్రిలా యెందువల్లనో ఉక్కిరిబిక్కి రవుతూ, ఒగరుస్తూ అన్నాడు.

"లేదు! రావటంలేదు! నేను......"

ఛెల్కాష్‌కి యేమీ అర్థంకాలే దాతని వైఖరి.

"ఏమిటి నీసంగతి?" గవ్రిలానిచూస్తూ అడిగేడు. గవ్రిలా ముఖం జేవురించి అంతలోనే వెలవెలబోయింది. అప్రయత్నం గానే యెంపుకో కొట్టుమిట్టాడేడు. ఛెల్కాష్‌మీద దూకుద మనో, యింకేదో తీరనికోరికతో ఉద్రేకపడుతున్నట్లు కనిపిస్తూ న్నాడు. ఈ పడుచువాడిలో అట్లాటి ఉద్రేకానికి కారణం తెలి యక ఛెల్కాష్ ఆశ్చర్యచకితుడై దీనికి పర్యవసానం యేమవు తుందోనని చూస్తూన్నాడు.

గవ్రిలా వెక్కి వెక్కి యేడుస్తూన్నట్లు విచిత్రంగా నవ్వ నారంభించేడు. తలను క్రిందికి వంచుకుని వుండడంవల్ల ఆతని ముఖవైఖరి ఛెల్కాష్‌కి కనిపించలేదు. కనిపిస్తూవున్న చెవులు మాత్రం ముందు యెఱ్ఱబడి మళ్ళీ అంతలో తెల్లనై పోయేయి.

"ఓరి! నీ దుంప తెగా! ఇదేమిట్రా? కొంపదీసి నన్ను ప్రేమించ లేదుగద? ఎవ రేనా చూస్తే నిన్నాడపిల్లవనుకుంటార్రా! నన్ను వొదిలివెళ్ళడం అంత బాధగావుందా? ఒరేయ్ బుల్లోడా!

చెప్పుమరి సంగతేమిటో? మాటాడకపోతే వెళ్లిపోతున్నా. అంతే!" అంటూ ఛెల్కాష్ చెయ్యి పట్టణంవైపు విసిరేడు.

"వెళ్ళిపోతున్నావా?" గవ్రిలా హఠాత్తుగా అరిచేడు.

ఇసుక పర్రంతా యీ గావుకేకకి ప్రతిధ్వని లీనింది. కెరటాలచేత నిరంతరం కడగబడుతూండే యిసుక తెరలు చాళ్ళు చాళ్ళుగా యీ కేకకే అదరిపడి వణుకుతూ వంకరలుగా ఐన ట్లున్నాయి. ఛెల్కాష్ కూడ ఉలిక్కిపడి నిల్చునిబోయేడు. ఉన్నట్లుండి గవ్రిలా నిలబడ్డచోటినుంచి పెగిలివచ్చి ఛెల్కాష్ పాదాలముందుపడి, కాళ్ళను రెండుచేతులా చుట్టబెట్టుకుని తన వైపు లాక్కుంటున్నాడు. ఛెల్కాష్ తొట్రుబాటుతో యిసకలో భారంగా చతికిలబడి పళ్లు కొరుకుతూ పిడికిలి బిగించిన చేతిని పైకెత్తేడు. కాని కొట్టడానికి చేతిని దింపకముందే గవ్రిలా దీనస్వరం బ్రతిమాలుకుంటూ గుసగుసగా వినబడి మేలుకున్నాడు:

"నేస్తం! నాకియ్యవూ! ఆ డబ్బునాకియ్యి! నీకుపుణ్యాం వుంటుంది! క్రీస్తు నిన్ను దయచూస్తాడు! అది నీకో లెక్కా? దాంతో నువ్వేంపెద్దకాపురంచేయాలా ఏమేనా? అదంతా ఒక్క రాత్రిలో ఖర్చుపెట్టేస్తావు!......ఒక్కరాత్రిలోనే తగులడిపోతుంది......నాకైతే ఎన్నో సంవత్సరాలబాటు వాడుకోడానికి వస్తుంది......నా కివ్వవూ?......నీకోసం గుళ్ళో ప్రార్థన చేయిస్తా!...ప్రతినిత్యమూ, మూడు దేవాలయాల్లో నీ ఆత్మ విముక్తికోసం......నామార్చన చేయిస్తా......నువ్వాదంతా

గాలికీ ధూళికీ కొరగాకుండా తగలేస్తావు......నేను దాన్ని భూమిమీద పెడతా! నాకివ్వవూ? ఏమిటి? అది నీకో లెక్కా? పత్రమా? అది సంపాదించడానికి నువ్వేమైనా శ్రమపడ్డావా? పెట్టుబడి అంతకుముందే లేదు! ఒక్కరాత్రి!......అంతే నువ్వు ధనికుడవైపోయేవు! ఈ ధర్మకార్యం ఒక్కటీచేయి! నువ్వెల్లాగా చెడిపోయిన వాడివే ......చూసేవూ? ......నువ్వెల్లాగా బాగుపడేది లేదు... నేనో? ... నాకియ్యవు!"

ఛెల్కాష్‌లో ఆశ్చర్యం, కోపం, అసహ్యంకూడా ఒక్క సారే ముప్పిరిగొన్నాయి. ఇసకలో చేతులు వెనక్కి ఆనించి చతికిలబడి మౌనంగా రైతు యువకునివైపు గుడ్లురిమి చూస్తూ న్నాడు. ఛెల్కాష్ మోకాళ్ళమీద తల ఆనించి మెల్లగా ఆపిఆపి గుసగుసగా తన ప్రార్థనను వెళ్ళబోస్తూన్నాడు గవ్రిలా. కొంతసేపు వింటూ కూర్చుని హఠాత్తుగా అతన్ని త్రోసేసి లేచేడు ఛెల్కాష్. జేబుల్లో రెండుచేతులూ పెట్టి నోట్లు తీసి గవ్రిలా మీదికి విసిరేసేడు.

"ఇవిగో! కుక్కా! తిను! రూపాయిలు మింగరా!" అరుస్తూ ఛెల్కాష్ ఉద్రేకంతో వణికిపోతూన్నాడు. దురాశా పరుడూ, నీచుడూ ఐన యీ బానిస గుణాలు చూసి క్రోధం తోనూ, అసహ్యంతోనూ మండిపడుతూన్నా, అదే సమ యంలో యీ నిర్భాగ్యపురైతుయువకుని మీద దయాను కంపాభావాలతో కూడ అతని మనస్సు చలించిపోయింది.

నోట్లు తీసి గవ్రిలామీద పారేస్తూంటే చెల్కాష్‌కి తానొక త్యాగీ, మహావీరుడూ ఐనట్లనిపించింది.

"నేనే నీకు యింకా చాలా యిద్దా మనుకున్నానురా! నిర్భాగ్యుడా! నీ కోసం నిన్న నేనెంతో విచారించేను కూడాను. పల్లెటూళ్ళని గూర్చి నాకు కళ్ళకి కట్టినట్లేవుంది. పోనీగదా! యేదో రైతుకుర్రాడు, సాయం చేద్దాం అనుకున్నాను! నువ్వేం చేస్తావో అంతా కనిపెట్టి చూస్తూనేవున్నా. అడుక్కుంటాడా? లేదా? దేబిరిస్తాడా? దేబిరించడా? అని కనిపెట్టేవున్నా! ఇంక నువ్వా!...ఛీ....తుక్కువెధవ్వి!....ముష్టిపీనుగువి! వెధవ డబ్బు కోసం అంత కొట్టుమిట్లాడి బాధపడిపోయేవంటే? ఎందుకురా? నీ బతుకు తగలెయ్యనా? ....మూర్ఖులు-దురాశాపాతకులు .... డబ్బు చూస్తూ వళ్ళు మరిచిపోతారు!....రైతులు....డబ్బే పావనం....పిల్లల్నే పావలా డబ్బులకు అమ్మేసే రకం!...."

చెల్కాష్ ధారాప్రవాహంగా తిట్టేస్తూన్నాడు.

"నేస్తం! నీ మీద దేవుడు దయచూపుతాడు. ఆహా! నాకెంత ధనంవుంది! నీ మేలు మరువను. నేనిప్పుడు ధనికుణ్ణి అయేను!" అంటూంటే గవ్రిలా కంఠం ఉద్రేకంతో కీచువారింది. నోట్లు లోపలి జేబులో భద్రపరచుకుంటూ మళ్ళీ ప్రారంభించేడు.

"అన్నా! నువ్వెంత మంచివాడివి! నిన్ను నాజీవితంలో యెప్పుడూ మరిచిపోను! మరి, యింకా నా పెళ్లాం, పిల్లలూ,-వాళ్ళందరిచేతా కూడా నీ ఆత్మవిముక్తికి ప్రార్థనలు చేయిస్తా!"

ఉద్రేకంతో గవ్రిలా వేసే కేకలూ, అరపులూ, యేడ్పులూ వింటూ, దురాశతో వికృతంగానూ, సంతోషంతో ప్రకాశమానంగానూ వున్న ఆతని ముఖం చూస్తూ ఛెల్కాష్ విస్తుబోయి నిల్చున్నాడు. తానెంత దొంగా, వ్యభిచారీ, త్రాగుబోతూ ఐనా యెన్నడూ అంత దురాశాపరుడుగా, నీచుడుగా, తన్ను తామరిచేస్థితిలో వుండలేదు! తానెప్పటికీ అట్లా ప్రవర్తించి వుండడు! ఈ ఆలోచనతో ఛెల్కాష్‌కి తన ఆధిక్యతా, స్వేచ్ఛా, విశృంఖలతా ఘనంగా తోచేయి. నిర్జనమైన ఆతీరాన విరుద్ధ మనఃప్రవృత్తులుగల ఆ యిరువురూ నిముషమాత్రం మౌనంగా ఒకరినొకరు ఆకళింపు చేసుకుంటూ నిలబడిపోయేరు.

"నువ్వు నన్నెంత సుఖవంతుణ్ణిగా చేసేవు." ఒక్కసారి వూదుకుని మళ్ళీ ప్రారంభించేడు గవ్రిలా. అంటూనే ఛెల్కాష్ చెయ్యి పట్టుకుని ముద్దెట్టుకోనారంభించేడు. ఛెల్కాష్ ఏమీ మాట్లాడలేదు. తోడేల్లా పళ్ళు యికిలించి గవ్రిలావైపు చూస్తూ వింటూ వుండిపోయేడు. గవ్రిలా హృదయాన్ని విప్పి ఒక్కటే ధోరణలో మాట్లాడేస్తున్నాడు.

"నేనేమని ఆలోచించేనో తెలుసా? దుర్మార్గుణ్ణి! మనం యిక్కడికి పడవ తోసుకొచ్చేటప్పుడు, దారిలో...డబ్బు చూపించేవు, నాకో దురాలోచన తట్టింది!...వాడికి తెడ్డుతో ఒక్కటిస్తా. అంతే. బస్! కిక్కురుమనడు. డబ్బు నాదైపోతుంది! వాణ్ణి సముద్రంలోకి తోసిపారేస్తా..... తెలిసిందా? నిన్నే! అయ్యో! ఎంత దురాలోచన!...నీకోసం యేడ్చేవాళ్లె

వరనుకున్నా! ఒకవేళ యెవరికేనా శవం దొరికినా యెట్లా చచ్చేడు? యెవరు చంపేరు? అని తాపత్రయపడరు! వీడూ ఓ మనిషేనా అనుకున్నా! నిజం! ఎవరూ వీణ్ణి గూర్చి పట్టించుకునేవాళ్ళే వుండరు! వీడు యెవరికీ, ఏవిధంగానూ ఉపయోగించే వాడు కాడుగదా! అట్లాంటి వాడికోసం పూసుకు నిలబడేదెవరు? అబ్బే! యెవడూ వుండడు! ఏం? అంతేనా!...."

ఛెల్కాష్ ముఖవర్చస్సు మారిపోతూంది. ఆపుకో లేక,-

"ఆడబ్బంతా యిట్లా యియ్యి!" అని మొరుగుతూన్నట్లరచి, గవ్రిలా కంఠంముడి పట్టుకున్నాడు.

గవ్రిలా విడుపించుకోడానికి గిలగిలల్లాడేడు. కాని ఛెల్కాష్ రెండో చెయ్యి పాములా అతన్ని చుట్టేసింది. చొక్కా పుర్రుమని చిరిగిన ధ్వని, చూస్తూండగానే గవ్రిలా యిసుకలో వెల్లకితలా పడిపోయేడు. భయంతో అతని కళ్లు విప్పారినాయి. కాళ్లూ చేతులూ గాలిలో కొట్టుకుంటున్నాయి. ఛెల్కాష్ కదురులా నిలబడి, పళ్లిగిలించి క్రూరంగా అట్టహాసం చేస్తూంటే అతని గుండెలు బ్రద్దలై పోయినట్లైనాయి.

ఛెల్కాష్ జీవితం అంతట్లోనూ అంతటి గాయాన్ని పొందివుండలేదు. అతని మనస్సులో ప్రతీకారాగ్ని చిచ్చులా భగ్గుమంటూంది. వికటాట్టహాసం చేస్తూనే అరిచేడు:

"నీ కిప్పుడు సుఖంగా వుందా? ఆశ తీరిందా? ఏం!" అంటూ కోపంగా వెనకతిరిగి పట్టణంవైపు నడక సాగించేడు. ఇంకా నాలుగడుగులేనా వెయ్యనేలేదు. గవ్రిలా పిల్లిలా ఒడు

వేసి ఒంటి మోకాలి మీద లేచి చేతిని బాగా వూతంగా జాపి ఓ గుండ్రని రాతిని గురిచూచి అతని మీదికి విసిరేసేడు.

"ఒ...క...టీ!"

ఛెల్కాష్ కెవ్వుమని కేకేసి, మెడపైభాగాన్ని రెండు చేతులా పట్టుకుని తూలుతూ గ్రవిలావైపు తిరిగి బోర్లా పడి పోయేడు. భయంతో గ్రవిలా గుండెలు కొట్టుకోడం మానేసేయి. ఛెల్కాష్ ఒక కాలు కదిల్చి, తలయెత్తడానికి ప్రయత్నించి విఫలుడై నారితెగిన ధనస్సులా వణుకుతూ విరుచుకు పోవడం చూసిన గ్రవిలా వెర్రివానిలా లేచి దూరంగా పరుగెత్తి పోయేడు. పొగమంచుతో నిండిన మైదానం మీద నల్లటిమేఘం ఒకటి వ్రేలాడుతూంది. వెలుతురు యింకా మసకగానే వుంది. కెరటాలు పందేలు వేసుకున్నట్లుగా పరుగులు పెడుతూ, యిసుకలో కరిగి యింకిపోతూ, మళ్ళీ వెనక్కి తగ్గుతూ, మర్మర ధ్వని చేస్తూన్నాయి. నురుగు బుసలుకొడుతూంది. తుపారం గాలిలో యెగురుతూంది.

వర్షం కురియ నారంభించింది. మొదట తుంపురుగా ప్రారంభమై కొద్ది సేపట్లోనే ఆకాశం చిల్లులు బడ్డట్టు ధారాపాతంగా కురుస్తూంది. సముద్రం, భూమి,—అన్నీ కూడా సన్నని నీటిధారల తెరతో కప్పబడి అదృశ్యంగా వున్నాయి. గ్రవిలా కూడ యెక్కడా కనిపించడంలేదు. సముద్రతీరాన యిసుకలో సాష్టాంగంగా పడివున్న మానవుని పొడుగాటి శరీరం వొక్కటే చాలాసేపటివరకూ అక్కడ పడుంది. కొంతసేపట్లో గ్రవిలా పరు

గెత్తుకుంటూవచ్చి పక్షిలా ఛెల్కాష్ శరీరందగ్గర వ్రాలి అటు నిటు దొర్లించ నారంభించేడు. అతనిచేతికి వెచ్చగా, జిగురుగా యేదో మెరటి పదార్థం అంటుకోడంతో ఉలిక్కిపడి గడగడ వణుకుతూ తెల్లబోయి వెనక్కి తగ్గేడు. అంతలోనే సంబాళించుకుని,—

"అన్నా! లే! లేవవూ?" అంటూ జడివాన సడిలోనే ఛెల్కాష్ చెవిదగ్గర గుసగుస లాడేడు.

వర్షపుధారలు ముఖం మీద పడడంతో ఛెల్కాష్‌కి స్మృతి వచ్చింది. కళ్లు తెరిచి చూచి గవ్రిలాను దూరంగా త్రోసేస్తూ,—

"పోరా, అవలికి పో!" అన్నాడు బొంగురుగా.

"అన్నా! నన్ను క్షమించు! నాకు శని పట్టింది! క్షమించవు?" ఛెల్కాష్ చేతిని యెత్తి ముద్దెట్టుకుంటూ గవ్రిలా మెల్లగా బ్రతిమాలు కుంటున్నాడు.

"వెళ్లిపో! నన్ను ముట్టుకోకు! పో!" ఛెల్కాష్ గుర్రుమని కసిరికొట్టేడు.

"ఈ పాపాల్ని నామీద పడనియ్యకు! నా ఆత్మని రక్షించు! అన్నా! నన్ను క్షమించవూ?"

"క్షమించాలా?...వెళ్ళిపో!...పోరా! నరకానికి పో!" ఉన్నట్లుండి ఛెల్కాష్ బిగ్గరగా అరుస్తూ యిసుకలో లేచి కూర్చున్నాడు. అతని ముఖం తెల్లబడిపోయినా కోపంగా కనిపిస్తూంది. కళ్ళు గాజుపారి, నిద్ర కూరుకు వస్తూన్నట్లుగా మూతలు పడుతూన్నాయి.

"నీకింకా యేంకావాలిరా! నీపని ఐపోయిందికాదూ?... వెళ్లు! ఫో! ఊఁ!"

బిగ్గరగా అరుస్తూ వొళ్ళు తెలియని కోపంతో ప్రక్కనే మోకరిలివున్న గవ్రిలాను తన్నబోయి ఛెల్కాష్ శక్తి చాలక దొర్లి పడిపోయేడు. గవ్రిలా రెండు చేతులా పొదివి కాగలించి పట్టుకోకపోతే పడిపోయేవాడే. ఇద్దరి ముఖాలూ యిప్పుడు సమానాంతరంగా వున్నాయి. ఇద్దరూ పాలిపోయి, భయం గొలుపుతూనే వున్నారు.

"థూ!" తెరచివున్న గవ్రిలా కళ్ళలో ఉమ్మేశాడు ఛెల్కాష్.

అతడు నెమ్మదిగా చొక్కాచేత్తో ముఖం తుడుచు కుంటూ సణిగేడు:

"నీ యిష్టంవచ్చినట్లు చెయ్యి! నేనేం యెదురు చెప్పను. దేవునికోసం, క్రీస్తుకోసం నన్ను క్షమించు!"

"చచ్చువెధవా! మోసం చెయ్యడానికి కూడా గుండెలు లేవురా నీకు!" అసహ్యంతో తిడుతూ చొక్కాగుడ్డ ఫర్రునచించి పళ్ళు బిగబట్టి తలకి కట్టుకో నారంభించేడు. కట్టు ముడేస్తూ, బిగించిన పళ్ళసందుల్లోంచే,—

"నోట్లు తీసుకున్నావా?" అన్నాడు.

"వాటిని ముట్టనైనాలేదు! అన్నా! అవి నా కక్కర్లేదు! వాటితో శాపంకూడా వెంటబడుతుంది!"

చెల్కాష్ జేబులోకి చేయిపోనిచ్చి నోట్లను పైకిలాగి, ఓ రంగులనోటును మాత్రం మళ్ళీ జేబులోకి తోసేడు. మిగిలిన వాటిని గవ్రిలావైపు జాపి,-

"ఇవిగో! తీసుకు వెళ్ళిపో." అన్నాడు.

"అన్నా! క్షమించవూ నన్ను? నే నవి తీసుకోను! అఁహాఁ! నా కొద్దు! నన్ను క్షమించవూ?"

"తీసుకోరా! చెపుతూంటే!" అరుస్తూంటే చెల్కాష్ కళ్ళమ్మట నిప్పులు కురిసేయి.

"ముందు క్షమించు నన్ను! తీసుకుంటాను!" పిరికిగా సణుగుతూ గవ్రిలా చెల్కాష్ పాదాలదగ్గర తడియిసకలో కూలబడ్డాడు.

"నాకు తెలుసు నువ్వెల్లాగా తీసుకుంటావని! పైకి బుడి బుడి యేడ్పులు! అబద్ధాలమారి వెధవలు!" అన్నాడు చెల్కాష్. ఆతడు నమ్మనిదే ఆ మాటలనడంలేదని ముఖం చూస్తేనే తెలుస్తుంది. ఎంతో కష్టంమీద వంగి సప్రయత్నంగా గవ్రిలా జుట్టుపట్టుకుని ఆతని ముఖం దగ్గర నోట్లని వుంచుతూ,-

"తీసుకోరా! తీసుకో! ఊరికే పనిచేసేవా ఏమిటి? లేదు! నాకు రైతులసంగతి బాగా తెలుసు! తీసుకో! భయం దేనికి? తోటి మనిషిని చంప యత్నించినందుకు సిగ్గుపడకు! నాలాంటి బికారీవాళ్ళ కోసం నిన్నెవరూ శిక్షించరులే! పైగా ఓ గజ దొంగని చంపినందుకు నిన్ను మెచ్చుకుంటారు కూడాను! సంగతి తెలిసినా! ఇందు! తీసుకో!" అంటూంటే చెల్కాష్

ముఖంమీద బలహీనంగా చిరునవ్వు మెరిసింది. నవ్వు చూసే సరికి గవ్రిలా ప్రాణాలు కుదుట పడ్డాయి. నోట్లు చేతులో పుచ్చుకుని నలిపేస్తూ,-

"అన్నా! క్షమించవూ? నా పాపాన్ని క్షమించవూ?" అని కళ్ళనీళ్ళతో ప్రాధేయపడుతూ బ్రతిమాలుకున్నాడు.

"అన్న! మంచి తమ్ముడే దొరికేడు!" వెక్కిరింతగా అని ఛెల్కాష్ తూలుతూ లేచేడు.

"క్షమించడం ఎందుకు? దేనికి? ఈ వేళ నువ్వు నాకు చేసినదే రేపు నీకు నే చేస్తా! అంతే! లోకమే అంత!"

"అయ్యయ్యో! అన్నా! అన్నా!" అంటూ తల నిరాశగా పంకించి నిట్టూర్చేడు గవ్రిలా.

ఛెల్కాష్ యెదురుగా నిలబడి తిరస్కారపూర్వకంగా నవ్వుతూన్నాడు. అతని తలమీద కట్టిన గుడ్డ యెరుపెక్కి తుర్కీ టోపీలా వుంది. వర్షం జోరుగా కురుస్తూంది. సముద్రం హోరుమని భయంకరంగా గర్జిస్తూంది. కెరటాలు కోపంతో గుభేల్ మని ఒడ్డును మోదుతూ, విరిగి పడుతూన్నాయి.

ఇద్దరూ మౌనంగానే వర్షంలో తడుస్తూ నిలబడ్డారు.

"నేస్తం! వెడతానురా! సెలవు!" వ్యంగ్యంగా అన్నాడు ఛెల్కాష్. అతని కాళ్ళు దడదడలాడేయి; తలను పోనీయకుండా పట్టుకున్నట్లు చిత్రంగా రెండుచేతులా పట్టుకుని తూలేడు.

"అన్నా! నన్ను క్షమించవూ?" బ్రతిమాలుతూ మళ్ళీ వేడుకొన్నాడు గవ్రిలా.

"సరేరా! అట్లాగేలే!" అంటూ తృణీకారంగా వెనక తిరిగి బైలుదేరేడు ఛెల్కాష్. తలను యెడమచేత్తో పట్టుకుని, కుడిచేత యెర్రటి మీసాల్ని మెలిద్రిప్పుతూ, తూలుతూ పోతూన్న ఛెల్కాష్ వైపు చూస్తూ చాలసేపు గవ్రిలా అక్కడే నిలబడ్డాడు. చివరకి వర్షంలో అతడు దృష్టిపథం దాటి పోయేవరకూ వుండి, తడిసి ముద్దయిన టోపీని తీసి చేత బట్టుకుని క్రాస్ చేసుకున్నాడు.

చేతిలోని నలిగిన నోట్లవంక చూసి నిట్టూర్చి జేబులో భద్రపరచుకుని, ఛెల్కాష్ పోయిన దిక్కు కెదురుగా పెద్ద అంగలతో దృఢంగా అడుగులేస్తూ బైలుదేరేడు.

సముద్రగర్జనా, వర్షపు హోరూ యేమీ తగ్గనే లేదు. కెరటాలు యిసుకమీద విరిగిపడుతూ తుంపురులుగా చెదిరి పోతున్నాయి. సముద్రంమీదా, భూమి మీదా కూడా వాన మొత్తుతూనే వుంది. గాలి ఝుంయ్ మంటూ వీస్తూ మూలుగుతూంది.

ఛెల్కాష్ పడివున్న చోటి నెత్తురుమరకను వర్షధారలు కడిగేసేయి. వాళ్ళిద్దరి అడుగుజాడలు కూడా కనిపించకుండా చెరిగిపోయినాయి. ఇద్దరు మానవుల మధ్య జరిగిన యీ ఆఖ్యాయిక ఆనవాళ్ళక్కడేమీ మిగలనే లేదు!

రచన : 1894.

**GORKY KATHALU** Rs. 2/-

Jaganmohan, M.

# జనులు : మహాజనులు

[మహాజనో యేన గతః స పంథా]

ఆహార నిద్రా భయ సంతానాదులలో మానవులు ఇతర జంతులోకంతోబాటే. కాని, వేదనలను, అనుభూతులను జ్ఞాపకం ఉంచుకుంటూ, మేధాశక్తిని క్రమంగా వృద్ధి పరుచుకుంటూ వచ్చిన మానవజాతి యితర ప్రాణిలోకం కంటె అత్యున్నతమైన, విలక్షణమైన దశకు వచ్చింది. బుద్ధివికాసంతో గూడిన రమ్యాలోచనలూ, ఆవేదనలూ, సంగీత- సాహిత్య- శిల్ప- యంత్రాది విద్యలన్నిటికీ మూలమైనాయి. మానవజాతి శైశవదశనుంచీ యెందరెందరో మహాజనులు మానవ సంస్కృతీ నాగరికతలను నూతనపథముల వెంట గొనిపోతూనే వున్నారు. జనులు ఆ మహాత్ముల ననుసరిస్తూనే వున్నారు.

ఈ గ్రంథంలో మానవజాతి చరిత్రలోని కొన్ని దృశ్యాలు అత్యద్భుతంగా వర్ణించబడినాయి. మానవ నాగరికతను, సంస్కృతిని నశించకుండా వుంచేందుకున్ను, అభివృద్ధి చేసేందుకున్ను ప్రాణాలొడ్డి కృషిచేసిన మహాత్ముల గాథలు అతి మనోజ్ఞంగా చెప్పబడినాయి. దృష్టిని విశాలమొనర్చి, బుద్ధికి వికాసాన్నిచ్చే గ్రంథం.

రచన: మైకేల్ ఇలిన్ & ఇ. సెగాల్.

అనువాదం: జగన్మోహన్‌రావు

అందరూ చదవాల్సిన గ్రంథం.

504 పుటలు, క్రౌను 1/8, చక్కని బైండు-జాకెట్‌తో వెల రు. **5/-** లు

**VISWASAHITYAMALA :: RAJAHMUNDRY.**